శ్రుతి సమ్మతములై మహర్షులచే బోధింపబడిన మంత్రం, ధారణ చేసి అనుష్ఠించుట. లోకహితనిష్ఠులైన బ్రాహ్మణ ధర్మంగా పాటింబడుచున్నది. అధ్యయనానికీ, అనుష్ఠానానికీ జీవితముల నంకితం చేసి, అధ్యపనము ద్వారా తర్వాతి తరమును తీర్చిదిద్దుట వారి కర్తవ్యంగా భావించిన వారు బ్రాహ్మణులు. దైవమునకు, భక్తులకు మధ్య వారధిగా నుండి జగద్ధితము కొరకు ప్రవర్తించుటచే వారు పూజ్యులైనారు. అట్టి వారికి మనస్సు శుద్ధియై, వాక్కులు సిద్ధించే స్థితి ఏర్పడుతుంది. వారు తిట్టినా, దీవించినా జరిగి తీరుతుంది. బ్రాహ్మణుల సొమ్ము విషంతో సమానమని, దుష్టులై అది అపహరించరాదని చెప్పారు. **'బ్రహ్మస్వం విషముచ్యతే'**. విషప్రయోగం చేత బాధితులకు మాత్రమే నష్టం వాటిల్లుతుంది. బ్రాహ్మణధనం, తరతరములను నాశనం చేస్తుంది.

అట్టి బ్రాహ్మణులు భూదేవతలుగా కీర్తింపబడ్డారు. అందుకే సంప్రదాయ పరిరక్షణకై భారతంలో కృష్ణుడు, బ్రాహ్మణుడు నా దైవమని వివరించాడు. లోకులకు ప్రమాణ బుద్ధి ఏర్పడుటకై వ్యాసుడు కృష్ణుని నోట ఈ మాట పలికించాడు.

**శ్లో॥ దైవాధీనం జగత్సర్వం, మంత్రాధీనంతు దైవతం ।**
**తన్మంత్రం బ్రాహ్మణాధీనం, బ్రాహ్మణోమమదైవతమ్ ॥**

అది ఆనాటి మాట, ఆస్థాయిని పరిరక్షించుకోవల్సిన బాధ్యత ఈ నాటి వారిపైనా ఉంది. అన్ని వృత్తులు కలుషితమైనట్లే బ్రాహ్మణ వృత్తికూడా కలుషితమై పోతోంది. చిత్తశుద్ధిలేని వారికి మంత్రాలు సిద్ధింపవు. మాన్యత లభించదు. విషయలోలురై అసత్య వచనులై, అధర్మ ప్రవర్తులైన వారి వల్ల తక్కిన వారికి అప్రతిష్ఠ ఏర్పడుతోంది. దైవమిచ్చిన ఆస్థాయిని కాపాడుకోవల్సిన బాధ్యత అందరి మీదా ఉంది. ఒక్కరిద్దరి ప్రవర్తన జాతి మొత్తాన్ని అపకీర్తి పాలు చేస్తోంది. ధర్మం తాము ఆచరించకుండా ఇతరులకు చెప్పే అర్హత తమకు ఎక్కడ నుండి వస్తుంది.

సంధ్యావందనాది నిత్యానుష్టానం కూడా చేయుటకు తీరిక, ఓపికలేకపోవుట చింతింపదగిన విషయమైపోయింది. మేమింతవారం, అంతవారమని గొప్పలు చెప్పుకొన్నంత మాత్రాన గొప్పతనంసిద్ధింపదు. ఆచరణముఖ్యం అది ఈనాడు శూన్యం. మాన్యులిది గమనింప వలసినదిగా మనవి. **జాతిమాత్రోపజీవుల వల్ల గౌరవభంగము** ఏర్పడుచున్నది. అందరూ కర్తవ్యమును గుర్తించగలరని విన్నవిస్తున్నాం. అనునయంతో చెప్పినదానిని అనుకూల ధోరణిలో ఆలోచించి గౌరవం నిలుపుకోవడమే బాధ్యత.



# కోరికలకంతమేది?

లోకులు ధనాన్ని, అధికారాన్ని, అందాన్ని, ఆనందాన్ని కోరడం సహజం. కోరికలేనిదే సాధన లేదు! ఒక విద్యార్థి 'నేను ఫలానా విద్యనభ్యసించా'లని అనుకొని శ్రమించి, ఉత్తీర్ణత సాధిస్తాడు. ఆ విద్య ద్వారా ధనం, కీర్తి మొదలగు సుఖాలు పొందగలుగుతాడు. ధర్మంగా సమాజానికి, దేశానికి సేవ చేయడానికి పూనుకొంటాడు.

ఈ కాలంలో ధనమే అన్నింటికీ మూలం. అందఱం ధనం కావాలని కోరుకొంటాం. అందులో, వంద ఉన్నవాడు వేయి కావాలని, వెయ్యి ఉన్నవాడు లక్ష కావాలని, లక్షాధికారి రాజ్యం కావాలని, భూమండలాన్ని మొత్తం పరిపాలించే రాజు, ఆపైన ఉన్న స్వర్గాన్ని కావాలనుకోవడం కోరికలకు అంతంలేదని తెలియజేస్తోంది. అందుకే పెద్దలు లోక స్వభావాన్ని ఇలా వివరించారు.

**శ్లో॥ ఇచ్ఛతి శతీ సహస్రం, సహస్రీ లక్ష మీహతే ।**
**లక్షాధిపః తథా రాజ్యం, రాజ్యస్థః స్వర్గమీహతే ॥**

భాగవతంలో వామనావతార ఘట్టంలో 'ఏది కోరితే అది ఇస్తా'నన్న బలి చక్రవర్తికి వామనుడు ఇట్లా చెప్పినట్లు వ్రాయబడింది. ఇది బహుశా, పోతన ఆత్మీయతను ప్రకటించే మాటకూడా అనిపిస్తుంది.

కం: **వ్యాప్తింజెందక, వగవక,**
**ప్రాప్తంబగు లేశమైన పదివేలనుచున్!**
**తృప్తిన్ బొందని మనుజుడు,**
**సప్త ద్వీపములనైనఁ జక్కంబడునే?**

ఒక రాజు, ఎప్పుడూ ఏవో రాజకీయమైన పనులతో తీరిక లేకుండా ఉండేవాడు. ఒకసారి రాణిగారు అదే విషయం ప్రస్తావిస్తూ ప్రక్క తోటలో రామయ్య దంపతులు చూడండి! వారెప్పుడూ అన్యోన్యంగా, ఆత్మీయంగా, హాయిగా జీవిస్తున్నారు. ఈమధ్య మీదర్శనమే కష్టమైపోతోందని తన ఆలోచన తెలియజేసింది. అందుకు రాజు తన బాధ్యతలను తెలియజేసి ఆమె నూరడిస్తాడు. అధికార బాధ్యతలు, ధనకాంక్ష, కీర్తిపై ఆపేక్ష, క్షణం నిలువనీయవు. లభించిన వాటితో తృప్తిపడడమే వాటన్నింటికీ పరిష్కారం. అది లేనినాడు పరితాపం తప్పదు.

# కుశలమ్

**శ్లో॥ లోకః పృచ్ఛతి సద్వార్తాం, శరీరే కుశలంతవ?**

**కుతః కుశల మస్మాకం? ఆయుర్యాతి దినే దినే!!**

బంధువులు, మిత్రులు, పరిచయం ఉన్నవారు వీరెవరైనా ఎపుడైనా, ఎక్కడైనా ఎదురు పడినప్పుడు "బాగున్నారా"? అని పలుకరిస్తారు. ఇది లోకధర్మం. అందుకు సమాధానంగా విన్నవారు మర్యాదకోసం ఆ, బాగానే ఉన్నామని చెప్తారు. కాని వివేకవంకులైన వారు మాత్రం రోజురోజుకు ఆయుర్దాయం గతించిపోతుంటే తమకెక్కడిదింక కుశలమని లోలోపల ఆలోచిస్తారన్నది ఈ సూక్తియొక్క భావం.

ప్రతి జీవికి పుట్టినప్పుడే "ఇంత" ఆయుర్దాయమని సృష్టికర్త నిర్ణయిస్తారు. వయసు పెరిగేకొద్ది ఆ ఆయుర్థాయం తరిగిపోతూ ఉంటుంది. ఉదాహరణకు నాకు 60 ఏళ్ళు వచ్చాయంటే నా ఆయువులో అరవై సంవత్సరాలు గడిచి పోయాయన్నది నిజం. దీన్నే కొందరు 'అంతా కులాసానా' అంటే 'అంతకు లాసే' అని ఆంగ్ల బాషాపదాన్ని చేర్చి చెప్తూ చమత్కరిస్తారు.

శ్వాసను నియంత్రణ చేసే యోగాభ్యాసం ద్వారా ఆయుర్దాయం పెంచుకోవచ్చని గురువులు సాధకులకు చెప్తారు. ఆవేశకావేషాలకు గురైనప్పుడు శ్వాకలధికమై ఆయుర్దాయం క్షీణింస్తుందనీ, కామక్రోధాదులే అందుకు కారణమని సూచిస్తూ ఏ అలజడులులేని ప్రశాంత జీవన విధానాన్ని పాటించమని వైద్యులు ప్రబోధిస్తారు.

గడచిపోయింది పోగా, జీవితంలో మిగిలిన సమయాన్ని మంచి ఆలోచనలను కలిగించి ధర్మాచరణమును ప్రోత్సహించే సత్సంగాదులతో గడపడమే క్షేమమని, మోక్షకారణమని గ్రహించడం ఈసూక్తి యొక్క తాత్పర్యంగా భావించవచ్చు.

**శ్లో॥ సత్సంగత్వే నిస్సంగత్వం, నిస్సంగత్వే నిర్మోహత్వం!**

**నిర్మోహత్వే నిశ్చలతత్వం, నిశ్చలతత్వే జీవన్ముక్తిః !!**



తపశ్శక్తికి మారుపేరు, నిగ్రహానుగ్రహ సమర్థుడైన అగస్త్యుని ఆజ్ఞపాటించి అతడు ఉన్నతములైన తనపర్వత శిఖరాలను ఉపసంహరించుకొని, మునికి సుఖంగా వెళ్ళడానికి మార్గాన్ని ఇచ్చాడు! ఆయన దక్షిణ దేశానికి తరలి వెళ్ళాడు. ఇప్పటికీ ఇంకా తిరిగిరాలేదు.

అప్పుడు సూర్యుని రథం కదిలింది. అతని కిరణములు, లోకమంతటా ప్రసరించి నూత్న చైతన్యాన్ని నింపాయి. జీవులందరూ ఊపిరి పీల్చుకొన్నారు. ప్రాణులన్నీ సంతోషించాయి. మేఘాలు వర్షించాయి. పంటలు పండాయి. జనజీవనం సక్రమంగా సాగింది.

పగతో, తనపంతం నెగ్గించుకొనేందుకు, ప్రకృతి విరుద్ధంగా ప్రవర్తించి, సమాజానికి సమస్యగా మారిన వింధ్యపర్వతం, భూస్థాపితం అయ్యింది.

ఎవ్వరేపని చేసినా పదిమందికి (ప్రపంచానికి) మేలుజరిగేలా ఉండాలేకానీ, అపకారం చేసేదిగా ఉండకూడదు. అది అపరాధంగా పరిగణింపబడుతుంది. సమాజం పట్ల బాధ్యతగా వ్యవహరించడం సామాజికుల అందరి బాధ్యత. సాహిత్యం ఇట్టి సంస్కారాన్ని ఇస్తుంది.

సృష్టికర్త బ్రహ్మ, తనసృష్టికి భంగం కలిగించినవారిని ఎవరిచేత, ఏవిధంగా అణిచివేయాలో లేదా పూర్తిగా తొలగించాలో నిర్ణయిస్తాడు.

వింధ్యగర్వాన్ని అగస్త్యుని ద్వారా రూపుమాపాడు. ప్రకృతిని కాపాడాడు అగస్త్యుడు. అగస్త్యుడు అంటేనే పర్వతముయొక్క అతిశయాన్ని కట్టడిచేసిన వాడు అని అర్థం. ఆ విధంగా అతనిపేరు సార్థకమైంది.



# భూ దేవతలు బ్రాహ్మణులు

పంచభూత సముదాయం ప్రపంచం. ఈప్రపంచం దైవం యొక్క సృష్టి. అందువల్ల జగము దైవాధీనమై ఉన్నది. ప్రకృతి వైపరీత్యములు మానవాతీత శక్తిని నిరూపిస్తున్నాయి. అదే దైవం – భగవంతుడు.

అట్టి దైవం మంత్రాలచే ఉపాసింపబడి సత్ఫలములను ఇస్తుంది. యజ్ఞ యాగముల ద్వారా వాతావరణ పరిరక్షణ, అభిషేక అర్చనముల ద్వారా వర్షములు కురిసి పంటలు పండి సమాజ అభ్యుదయమునకు, అభీష్టసిద్ధికి దోహదం చేస్తాయి.

"పౌరుషంగల పురుషునకు, కంటకుడైన శత్రువు తనంతటి వాడొకడున్నప్పుడు, కంటికి నిద్రరాదు. వంటకములు రుచించవు. ఇతర వైభవములు పదివేలు ఉన్నా మనసుకు పట్టవు" అని ఆలోచించి మేరువుపై పగసాధించడానికి గట్టిగా పూనుకొన్నాడు.

**ఉ॥ కంటికి నిద్రవచ్చునె, సుఖంబగునే రతికేళి, జిహ్వకున్**
**వంటకమించునే? ఇతరవైభవముల్ పదివేలు మానసం**
**బంటునె? మానుషంబుగల యట్టి మనుష్యున కెందునేనియున్**
**కంటకుడైన శాత్రవుడొకండు తనంతటివాడు కల్గినన్** కా.ఖం; 1 అ. 108 వ ప.

తెలుగు సాహిత్య చరిత్రలో ఈ పద్యానికొక ప్రత్యేకత ఉంది. శ్రీనాథమహాకవి యుపజ్ఞకిది గొప్ప ఉదాహరణం –

ఆ తర్వాత, వింధ్య పర్వతం రాత్రికి రాత్రి తన శిఖరములతో, ఆకాశాన్ని తాకి, సూర్యరథ గమనాన్ని అడ్డుకొంది. అంతే ఇంక తెల్లవారలేదు. ప్రొద్దుక్రుంకలేదు. ప్రకృతి వ్యవహారమంతా ఆగిపోయింది.

కొందరికి మిక్కిలి ఎండకాచింది. కొందరికి చలివిపరీతంగా బాధించింది. కొందరు నిద్రలేవలేదు. ప్రపంచ వ్యవహారమంతా అస్తవ్యస్తమై పోయింది. కొందరికి చీకట్లు తొలగిపోలేదు. దేవ, ఋషి, పితృకార్యములు మూతపడ్డాయి. దిక్కుతోచక జగమంతా హాహాకారాలు అధికమయ్యాయి.

ఊహింపని ఉపద్రవం వచ్చిపడింది. దేవుతలు, మునులు బ్రహ్మను సమీపించి ఉన్న కష్టాలు విన్నవించుకొన్నారు. ఆయన ఈ ఆపద పోగొట్టగలిగినవాడు అగస్త్యుడు. అతనిని ప్రార్థించండని చెప్పి వారిని పంపించాడు.

లోపాముద్రతో అగస్త్యుడు ఆనందకాననమైన అవిముక్త సీమలో శ్రీకాశీ విశ్వేశ్వరుని సేవిస్తూ, పరమ నిష్ఠాగరిష్ఠుడై జీవితం గడుపుతున్నాడు. ఇప్పటి అవసరాన్ని గుర్తించి, బ్రహ్మగారి యందుండే గౌరవంతో ఆయన ఆజ్ఞమేరకు, ప్రపంచశ్రేయస్సును కాంక్షించి అక్కడనుండి బయలుదేరి వింధ్యపర్వతాన్ని సమీపించాడు. స్వాగతించటానికి ఎదురుగా వచ్చిన అతనితో మేము దక్షిణదేశయాత్రకు పోతున్నాం. ఈ పెద్దతనంలో నీ ఎత్తైన శిఖరాలు ఎక్కి దిగలేము. మేమువెళ్ళి తిరిగివచ్చేదాకా నీవు భూమిలో అణిగి ఉండమని ఆదేశించాడు.



# మహాత్ములు

**శ్లో॥ ఉదయే సవితా రక్తః, రక్తఃశ్చాస్తమయేఽపిచ!**
**సంపత్తౌచ విపత్తౌచ, మహతామేక రూపతా !!**

ప్రపంచంలోని సమస్త ప్రకృతికి సూర్యుడే ఆధారం. ప్రతిఒక్కరి ఆరోగ్యానికి అతడే మూలకారణం. ఆ సూర్యుడు ఉదయించేటప్పుడు తన అరుణ కిరణాలతో లోకాన్ని సంతోషపెడతాడు. సాయంత్రం అస్తమించేటప్పుడు అదేవిధంగా కనువిందు చేస్తాడు.

కోరికతో జనం సముద్రతీరానికి చేరి, మనోహరమైన ఆ సూర్యుని అంద చందాలను వీక్షించడం కోసం ప్రయత్నిస్తుంటారు. ఆ సూర్యుని విధంగానే మహాత్ములు సంపదలలోను, ఆపదలలోను ఒకే రూపంతో దర్శనమిస్తారు. ఎట్టి వికారమునకు లోనుకారనేది ఈ సూక్తిసుధలోని మాధుర్యం.

శ్రీమద్రామాయణంలో దశరథ తనయుడైన శ్రీరాముడు తండ్రి తనకు రాజ్యమిస్తానన్నప్పుడు, పితృ సత్యవాక్యపరిపాలనకోసం అయోధ్య విడిచి నారచీరలతో వనవాసాలకు వెళ్ళవలసివచ్చినప్పుడు, ఏవిధమైన మనోవికారాన్ని పొందలేదని వాల్మీకి రాముని గాంభీర్యధైర్యములను వర్ణించిన విధము పైసూక్తికి ప్రబలోదాహరణంగా చెప్తారు విమర్శకులు.

**శ్లో॥ న వనంగంతు కామస్య త్యజతశ్చ వసుంధరాం!**
**సర్వలోకాతిగస్యేవ, లక్ష్యతే చిత్త విక్రియా !!**

లోకంలో తమయొక్క, తమవారి యొక్క మేలు కోరుకునే వారు సామాన్య మానవులు, సమాజంతోపాటు ఉన్నవారందరూ సుఖపడాలని, అభ్యుదయం సాధించాలని కోరుకునేవారు మహాత్ములు. నిస్వార్థజీవనులైన వారికి కుల, మత, ప్రాంత విభేదం ఉండదు. పరిమితులకు లోబడని ఆ మహాత్ములు సంపదలలో, ఆపదలలో మనఃస్థైర్యమును కోల్పోరు. అట్టి వారిని మనం ఆదర్శంగా గ్రహించడం వలన జీవితబాటలో దిద్దుబాటుకు అవకాశం ఉంటుంది. మనం అద్దంచూసి ముఖం దిద్దుకున్నట్లు, ఆ మహాత్ములను చూసి మన లోటుపాట్లను సరిచేసుకోవాలి. అప్పుడే జన్మసార్ధకత లభిస్తుంది.

# మానవీయ బంధాలు

శ్లో॥ మితం దదాతి హి పితా। మితం మాతా! మితం సుతః।

అమితస్యహి దాతారం।భర్తారం కా నపూజయేత్ ॥

(వాల్మీకి రామాయణం)

లోకంలో అనుభవైకవేద్యమైన అనుబంధాలు చాలా చిత్రంగా ఉంటాయి. వాటిని వివరించటానికి మాటలు చాలవు. తల్లిదండ్రులు, అన్నదమ్ములు, మిత్రులు, తక్కినబంధువులు మొదలైన వారెందరో ఉంటారు. అందరిలోను భార్యాభర్తల అనుబంధమే దృఢమైనది. జీవితంలో సుఖదుఃఖములు సమముగా అనుభవించేవారు దంపతులే. ఆడపిల్లకు తండ్రి విద్యాబుద్ధులతో పాటు కట్నకానుకల రూపంలో ధనం కొంత ఇవ్వగల్గుతాడు. తల్లికూడా బిడ్డలకు చేతనైన సహాయం చేయగల్గుతుంది. అక్కా, చెల్లెళ్ళు, అన్నదమ్ములు అంతే. ఇక కడుపున పుట్టిన బిడ్డలు కూడా అంతంతమాత్రమే. సర్వస్వము ఇచ్చువాడు భర్త ఒక్కడే!.

భర్త యొక్క భాగ్యం (అదృష్టం) భార్య అనుభవిస్తుంది. భర్త తన సర్వశక్తులు వినియోగించి కుటుంబవృద్ధికి పాటుపడతాడు. అది అతని కర్తవ్యం. మాట చెప్పుకొన్నా, మనస్సు పంచుకున్నా స్త్రీ, పురుష(దంపతు)లకే అది పరిమితం. తనతో సమానంగా అభిమానించగల్గినవాడు, బాధ్యతగా ఉండేవాడు భర్త. అట్టి భర్తనే ఏభార్యఐనా గౌరవిస్తుంది. కుటుంబ వృద్ధికి తన వంతు సహకారాన్ని అందిస్తుంది. అట్టి ఇల్లు 'శాంతినిలయం' అవుతుంది.

సున్నితము, సూక్ష్మమైన ఈ ధర్మాన్ని మరచిపోయినపుడే కలతలు, కడగండ్లు ప్రారంభమౌతాయి. స్త్రీని గౌరవించిన యింట సిరులు పొంగుతాయి. సంస్కృతి కాపాడబడుతుంది. బిడ్డలు అభివృద్ధిలోకి వస్తారు. ధర్మం రక్షించ బడుతుంది. ఈ సంగతి తెలియని మూర్ఖులు అనవసరమైన విషయములతో సంసార బంధాన్ని పాడు చేసుకుంటారు. జీవితాంతం దుఃఖాలు అనుభవిస్తారు. కలహాల కాపురం కలకాలం సుఖంగా సాగదు. సంప్రదాయం దెబ్బతింటుంది. అశాంతి చోటుచేసుకుంటుంది.



వెనుక బుక్కులో వర్ణించబడిన ఆ మహాపురుషుడు మూడు భాగముల అమృతస్వరూపుడు. సంసారరహితుడు. బ్రహ్మము అజ్ఞాన కార్యమయినట్టియు, జనన మరణ ప్రవాహరూపముగ ఆ సంసారమునకు ఆవలివాడు. మృతాత్మకమైన ఈ జగత్తుకు ఉన్నట్టి గుణదోషములు లేశమాత్రము లేనివాడు. ఆ పరమాత్మ యొక్క అమృతరూపమైన నాలుగవ భాగము మాయామేయమైన ఈ జగత్తునందు ఆత్మగా ఉన్నది. ఆభాగము సృష్టిసంహారములుతో (జననమరణములతో) మాటిమాటికి వచ్చుచున్నది. (ఈ జగత్తు అంతయు పరమాత్మయొక్క లేశమాత్రమని గీతయందు భగవానుడు చెప్పినాడు) అదివిన్న నారదుడికి మనసులో వెగటువేసింది. ఇట్టి వింధ్యపర్వతానికి గర్వభంగం తప్పదని మనసులో నిర్ణయించుకొని పైకి ఏమీ అనలేక కొంతసేపు మౌనంగా ఉండి, దీర్ఘంగా నిట్టూర్చాడు.

చివరకు నారదుడు అతనితో ఇట్లా అన్నాడు. మీ బలాబలాలు మీకే బాగా తెలుస్తాయి. మీలో ఎక్కువ తక్కువలు నిర్ణయించగల వారెవ్వరు? ఇతరులకది సాధ్యంకాదు. నిజానికి మీ ఇద్దరికంటే గొప్పవారెందరో ఈ లోకంలో ఉన్నారు. "తాడితన్నేవాడు ఒకడుంటే వాడి తలతన్నేవాడింకొకడ"నే సామెత వినే ఉంటావు. అయినా మావంటి తీర్థయాత్రా పరాయణులకు ఇది ఆలోచింపదగిన విషయంకాదు. మీకు మేలుకలుగుగాక, నేను పోయివస్తాను" – అంటూ నారదుడు తనత్రోవనతాను వెళ్ళిపోయాడు.

ఆ ముని మాటలు విన్న వింధ్యపర్వతానికి చాలా బాధకలిగింది. మేరువును గూర్చి తలచుకోగానే కోపం వచ్చింది. ఉద్రేకం కట్టలు త్రెంచుకొని బయపడింది. తనలో ఇలా ఆలోచించింది.

"చేసిన ప్రతిజ్ఞ సాధించడం కోసం, జ్ఞాతిపై విజయాన్ని పొంది, కీర్తి సంపాదించడం, శాస్త్రం గురుముఖంగా నేర్చుకోవడం జరగాలి. జ్ఞానవైరాగ్యములతో వేదాంత విషయాలను ఒంటపట్టించుకొని ఆలోచింపకపోతే ఎవరికైనా పుట్టుక సార్థకంకాదు. నాకు పట్టిన ఈ చింతాజ్వరం వైద్యులుగుర్తించేదికాదు. మందులకు తగ్గేది కాదు. నాతహతహతీరేట్లుగా మేరువుపైకిదూకి పాదములతో త్రొక్కి బురదలో తాడిపండదిమినట్లు పాతాళందాకా అణచివేయాలని ఉంది.

సమయం కోసం ఎదురుచూస్తోంది. అంతలో ఒకనాడు నారదులవారు తీర్థయాత్రలకని ఆ త్రోవన పోతూ ఉంటే, వింధ్యపర్వతం, తన దివ్యాత్మరూపంతో ఎదురువెళ్ళి, మర్యాదగా పిలిచి, కూర్చోబెట్టి, లోకంలో సంగతులన్నీ ఏకరవు పెట్టూ తనకు, మేరువునకు మధ్యగల విభేదాన్ని తానూహించుకొన్న విధంగా వివరించి "అన్నీ తెలిసినవాడవు. మాఇద్దరిలో ఎవరుగొప్ప? మొహమాటం లేకుండా చెప్పు" అని ఎంతో స్వాతిశయంగా మాట్లాడింది. **"అసతోమా సద్గమయ తమసోమా జ్యోతిర్గమయ। మృత్యోర్మా మమృతంగమయ।"** ఈ మహామంత్రార్థము రూఢమగుటకు ఈ విచారణ ఎంతేని ఉపయోగపడును.

**"ఏతావా నస్య మహిమా అతో జ్యాయాగ్‌శ్చ పూరుషః**
**పాదోస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి॥"** (ఋగ్వేద - మం - 10, అ-7, సు 70, ఋక్ 3)

దీని అర్థము – జరిగిన జరగబోవు జరుగుచున్న అసద్రూపమైన జగత్తు ఎంతగలదో అది అంతయు పురుషుడైనట్టి సద్రూపుడైన పరమాత్మ యొక్క మహిమ. ఆ పరమాతమ్మయొక్క సామర్థ్య విశేషము. కానీ అతని వాస్తవరూపముకాదు. పరమాత్మయొక్క వాస్తవ రూపమైతే పురుషునికంటెను, అతని మహిమకంటెను గొప్పది, సర్వాతిశయమై అధికమైనట్టుది ఆ రెండును స్పష్టీకరింపబడుచున్నవి. ఆ పురుశునకు భూత భవిష్యద్వర్తమాన కాలములందున్న సమస్తప్రాణి జాతము ఒకపాదము. అనగా నాలుగవభాగము ఆ పురుషునియొక్క మూడుపాదములు – అనగా మూడు భాగములు వినాశరహితమైనట్టియు, అమృతస్వరూపమైనట్టియు ద్యోతనాత్మకమైన స్వప్రకాశమందున్నది. (అది అనేకకోటి బ్రహ్మాండములయొక్క బ్రహ్మాబిలము భేదించుకొనిపోగా, గాఢాంధకారమునకు ఆవలగా కోటిసూర్యుల నెలుగుతోనుండును. ఆ తమస్సు నుండి జ్యోతిని పొందవలెను.

"ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్" "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" అను శ్రుతిప్రమాణముచే అనంతుడైన ఆ పరమాత్మకు నాలుగు భాగములుగా పాదవిభఆగము అశక్యమే అయినను ఆ జాగత్తు బ్రహ్మముకంటె అల్పమని జచెప్పుడకు మాత్రమే పాదవిభాగము.

**"త్రిపా దూర్ధ్వ ఉదైత్పురుషః పాదో స్యే హాభవాత్పునః।**
**తతో విశ్వ...క్రామ త్సాశనానశనే అభి॥"** (ఋగ్వేద – మం – 10, అ–7, ఋక్ 4)



స్త్రీ రత్నము, సీతమ్మ చెప్పిన ఈ మాటలో చాలా రహస్యం ఇమిడి ఉంది. రాముని అంతరంగానికి నోచుకున్న సీత, అడవినే అయోధ్యగా భావించింది. వియోగదశలో ప్రలోభానికి లోనుగాక, రావణునంత వానిని ధైర్యంగా ఎదిరించి నిలిచింది. శీల, చరిత్రములను చక్కగా కాపాడుకుంది. స్త్రీ మనసు నొచ్చుకోకుండా ఆదరించి అభిమానించాల్సినవాడు పురుషుడు. అతనిని అనుసరిస్తూ ఆనంద హేలగా ఇంటిని తీర్చిదిద్దుతూ ఆదర్శంగా ఉండవలసినది స్త్రీ. చక్కని ఈ అనుబంధానికి నేడు అవరోధాలు ఎన్నో ఏర్పడుతున్నాయి. వాటిని అధిగమిస్తే ఆనందం. లేకుంటే అంధకారం. పాశ్చ్యాత సంస్కృతియొక్క ప్రభావం సంసార జీవితాలను దుఃఖమయం చేస్తోంది. అంతరంగాలను దూరంచేస్తోంది. తస్మాత్ జాగ్రత్త.



## సాధుల చరిత్రలకు పునరుక్తి దోషంలేదు

లోకంలో కొన్ని, ఎన్నిసార్లు చూసినా చూడాలనిపిస్తుంది. మరెన్నిసార్లు విన్నా, కొన్ని ఇంకా వినాలనిపిస్తూనే ఉంటాయి. ఆ విషయంలో తనివి తీరదు. హాయితరగదు. ఎన్నిమార్లు వసంతం వచ్చినా, ప్రకృతి ఎంతో సుందరంగానే గోచరిస్తుంది. ఎంత విన్నా కోయిల కలకూజితాలు గానమాధుర్యాన్ని పంచుతూనే వుంటాయి. మహాత్ముల సుచరిత్రలు కూడా మనసులకు ఉల్లాసాన్ని, జీవితాలకు ఉత్సాహాన్ని కలిగిస్తూనే ఉంటాయి. అందులోనే ఉన్నదేదో పరమ రహస్యం, ఇదే నిత్య సత్యం.

**దృష్ట్వాపి దృశ్యతే దృశ్యమ్, శ్రుత్వాపి శ్రూయతే శ్రుతమ్!**
**సత్యం, న సాధువృత్తస్య, దృశ్యతే పునరుక్తతా!!**

నవరసభరితమైన రాముని చరితములోను ఇదే సంగతి మనకు అవగతమౌతుంది. రామాయణం కట్టె, కొట్టె, తెచ్చె అన్నట్లు మూడు ముక్కలలో

ఇమిడిపోతుంది. విస్తృతార్థంగా వివరించినా ఇంకా వివరంగా వింటే బాగుండు ననిపిస్తుంది. ఆకథలోనే రసరమ్యమై మహాకావ్యత్వం చోటుచేసుకుని వుంది. ఎవరు చెప్పదలచినా అతడు కవి అవుతాడు. వివిధ భాషల్లో, హరికథ, బుర్రకథ, తోలుబొమ్మలాట మొదలుకొని శతకం, నాటకం, కావ్యం, పురాణం మొదలు అనేక ప్రక్రియలలో కీర్తింపబడినప్పటికి కూడా ఆ ఇతిహాసం దృశ్యంగా, శ్రవ్యంగా పునరావృత్తమౌతునే వుంది. భారతదేశంలోనే కాదు ప్రపంచ భాషలన్నింట్లోను ఇది చెప్పబడింది.

తెలుగులో రామాయణ పరంపరాసక్తి సరికట్టు కవి పుట్టనేలేదు. ఇప్పటికీ ఆలోటు తీర్చువారూ లేరు. ఇందరు వ్రాసిన రామాయణం నువ్వెందుకు వ్రాసావని లోకం అడుగుతుందేమోనని, తానే శంకించి, సమాధానంగా **శ్రీవిశ్వనాథ సత్యనారాయణ గారు "మఱలనిదేల రామాయణం బన్నచో, లోకము తినుచున్న అన్నమే తినుచున్నది, ఇన్నాళ్ళు చేసిన సంసారమే చేయుచున్నది, తన రుచి బ్రతుకులు తనవి కాగ"** అని చెప్పి ఇతరులు వ్రాసిన రామకథనే తాను, తన అభిరుచికి తగినట్లు వ్రాసానని వివరించారు. రామాయణంలో గల ప్రత్యేకత అటువంటిది. రాముని గుణములు కవులను ప్రలోభపెడతాయి. శ్రోతలను ఆకట్టుకుంటాయి. అందుకే ఈ భూమిమీద కొండలు నిల్చి ఉన్నంతకాలం నదులు ప్రవహించు చున్నంతకాలం రామకథ లోకములందు ప్రచారంలో ఉంటుందని ధైర్యంగా చెప్పాడు వాల్మీకి.

**శ్లో॥ యావ స్థాస్యంతి గిరయః సరితశ్చమహీతలే !**
**తావద్రామకథా లోకేషు ప్రచలిష్యతి !!**





## పోటీతత్త్వం - సామాజిక బాధ్యత

ఈనాడు అన్ని రంగాలలోను పోటీ ఎక్కువైపోయింది. పోటీని సంస్కృతంలో 'స్పర్థ' అని అంటారు. ఈ 'స్పర్థ' వలననే విద్య వృద్ధి పొందుతుందని పెద్దలు చెప్తారు. "స్పర్థయా వర్ధతే విద్యా". ఆరోగ్యకరమైన పోటీ ఎప్పుడైనా ఆనందాన్నిస్తుంది. అభివృద్ధికి దోహదం చేస్తుంది. అసూయతో, ఆత్మన్యూనతా భావంతో చేసే పనులు, అనర్థానికి దారితీస్తాయి. అవమానాలకు గురిచేస్తాయి. అది ఆత్మహత్యాసదృశమే అవుతుంది. ఆ సుడిగుండాలనుండి బయటపడినప్పుడే ప్రగతి సాధ్యమవుతుంది. ఆ ఊబిలో పడినవారి జీవితం అధోగతిపాలవుతుంది.

ఈ పోటీ, విద్యకు, ఉద్యోగానికే పరిమితంకాలేదు. ఆటపాటలకు, వ్యవసాయానికి, వ్యాపారానికి విస్తరించింది. వృత్తులకు, వర్గాలకు, కులాలకు, మతాలకు కూడా వ్యాపించింది.

మానవులలోనే కాదు ఈ పోటీతత్త్వం అప్పుడప్పుడూ పశుపక్ష్యాదుల మధ్య కూడా ఏర్పడడం చూస్తూ ఉంటాం. (ఆబోతులు, కోడిపుంజులు మొ॥). నాగరికత అలవడిన మానవులమధ్య ఈపోటీ పెచ్చుపెరిగి కుటిలము, కుత్సితమై సమాజానికి బాధాకరంగా పరిణమించిన సందర్భాలు లేక పోలేదు. ఇట్టి మానవనైజాన్ని పర్వతముల పరంగా వర్ణించి, అహంకారం ఉన్నవారు అణచివేయబడతారని నిరూపించడం జరిగింది.

కాశీఖండంలో శ్రీనాథుడు ఈ ఘట్టాన్ని చాలా అద్భుతంగా వివరించాడు. లోకంలో, మేరుపర్వతానికి ప్రసిద్ధి ఎక్కువ. అసలే అది బంగారుకొండ. దేవధనములన్నీ అక్కడే నిక్షిప్తం చేయబడి ఉంటాయి. గ్రహపతులు, దేవతలు దాని చుట్టూ తిరుగుతూ ఉంటారు. ఇక సామాన్యుల సంగతి చెప్పాలా? అందరిదృష్టి దానిమీదే. నిత్యము ప్రజలు తమ ఉనికిని తెలియజేసేందుకు మేరువే ప్రమాణముగా చెప్పబడుతుంది. ఇదంతా చూసి వింధ్యపర్వతానికి బాధవేసింది.

తనకు ఏమితక్కువ? లోకమెందుకు తనను ఇంతచులకనగా చూస్తోంది? మేరువంత విస్తారంగా లేననా? ఎత్తు ఎదగలేననా? అని ఆలోచించుకుంటూ, ఏదేదో ఊహించుకొంటూ, తన గొప్పతనాన్ని లోకానికి చాటిచెప్పాల్సిందేనని గట్టిగా నిర్ణయించుకొంది.

## పండితుల దృష్టిలో పరమాత్మ యొక్కటే

ప్రకృతి కాధారమైఉంటూ దాని కతీతంగా ఉన్న అతీంద్రియ శక్తి ఒక్కటే! అది విశ్వమంతా వ్యాపించిఉంది. అన్నింటినీ నడిపించే ఆ దివ్యశక్తిని అంతటా దర్శించడమే విద్యలలో మర్మాన్ని తెలుసుకొన్నవారి వివేకానికి చిహ్నం. చైతన్యమే శక్తి. అభిరుచినిబట్టి స్త్రీ, పురుష భేదములు కల్పితములే.

మట్టి ఒక్కటే! వినియోగాన్ని బట్టి భాండము(కుండ)లు అనేక రూపాలలో చేయబడ్డాయి. బంగారం ఒక్కటే, వివిధ ఆభరణాలుగా ధరింపబడుతుంది. గోవులు ఎన్నైనా పాలు ఒక్కటే! శరీరాలు ఎన్ని అయినా అందులో ఉన్న పరమాత్మ ఒక్కటే!

శ్లో॥ **మృత్పిండ మేకో, బహుభాండ రూపః ।**
**సువర్ణ మేకమ్, బహు ధేను జాతమ్ ॥**
**గోక్షీర మేకమ్, బహు ధేను జాతమ్ ।**
**ఏకః పరమాత్మ, బహు దేహవర్తీ ॥**

దీనినే అందఱికీ శ్రీహరే అంతరాత్మ అని అన్నమాచార్యులవారు కీర్తించారు. పశ్యామితమ్ సర్వజనాన్తరస్థమ్, నమామి హంసం పరమాత్మ రూపమ్. జీవులన్నింటిలో ఉన్న ప్రాణ స్వరూపమే ఆ పరమాత్మగా గుర్తించారు పెద్దలు. ఆ సమదర్శులనే పండితులని పేర్కొన్నారు. అట్టి వారికి, దేహబుద్ధితొలగి, పరమాత్మరూపమైన ఆత్మతేజము దర్శనమిస్తుంది. ఆ అంతర్దృష్టని ప్రసాదించమని పరతత్వాన్ని వేడుకొందాం.

సువిశాలమైన భారతదేశంలో భిన్నకాలాలలో భిన్నభిన్న సంప్రదాయాలు, ఆచార వ్యవహారాలు చోటు చేసుకొని, ఆరాధనా విధానాలు నెలకొన్నాయి. శైవ, వైష్ణవాది స్వరూప వర్ణములేర్పడ్డాయి. అన్నింటియొక్క పరమార్థం ఒక్కటే! ఆనందమే స్వభావంగా గల ఆ పరతత్వాన్ని దార్శనికులు తమతమ అభిరుచులను జోడించి వ్యక్తపరచారు. అభివ్యక్తిలో వైవిధ్యమే కానీ, వస్తుతత్వంలో భేదం లేదు. ఆ భిన్నత్వంలో ఉన్నది ఏకత్వమే! అదే భారతీయ ఋషి ఆత్మ. సంప్రదాయజ్ఞులు, ఆదిశంకరులు, ఈ ఏకత్వాన్ని తెలియచెప్పడానికే 'పంచాయతన పూజ' విధానాన్ని మనకు అందించి యథార్థాన్ని బోధించారు-గ్రహించడం మన కర్తవ్యం.



## త్వరపడండి, త్వరపడండి.

శ్లో॥ **క్షణం చిత్తం క్షణం విత్తం, క్షణం జీవిత మావయోః।**
**యమస్యకరుణానాస్తి, ధర్మస్య త్వరితాగతిః॥**

'చిత్తం' అంటే మనస్సు, చంచలమైన ఆ మనస్సు కోతిలాగా అటు ఇటు సంచరిస్తూ ఒకచోట నిలకడగా ఉండక, పరుగులు పెడుతూ ఉంటుంది. ఏదైనా ఒక విషయం నిర్ణయం చేసుకొనే ముందు అవునని, కాదని ఎన్నోవిధాలుగా ఆలోచిస్తుంది. అందులో మేలు కీళ్ళను ఎంతగానో బేరీజువేస్తుంది. క్షణంలో ఉన్న మనస్సు(కోరిక) తదుపరి క్షణంలో మారిపోతుంది. మనస్సు స్థిరపరచుకొని లక్ష్యంవైపు పయనించటం వ్యక్తి వివేకం మీద ఆధారపడి ఉంటుంది. అది బుద్ధిమంతుల లక్షణం.

'విత్తం' అంటే సంపద(ధనం) అని అర్థం. అది ఒకప్పుడు ఉంటుంది. మరొకప్పుడు పోతుంది. అది శాశ్వతంకాదు. నరుడికి 4దశలన్న పెద్దలమాటలో అంతర్యమిదే. అందుకే సుమతీశతకకర్త.

**సిరితా వచ్చిన వచ్చును**
**సరభసముగ నారికేళ సలిలము భంగిన్।**
**సిరితా పోయిన పోవును**
**కరిమ్రింగిన వెలగపండు కరణిన్ సుమతీ॥** అన్నాడు.

కొబ్బరికాయలోకి, నీళ్ళు వచ్చిచేరినట్లుగా అప్రయత్నంగానే సంపద వచ్చి చేరుతుంది. పోయేరోజున బూజుపట్టిన వెలగపండులా నిరుపయోగంగా హరించుకుపోతుంది. ఇదంతా గమనించిన వివేకవంతులు అస్థిరమైన సంపదల కొఱకు ఆరాటపడరు.

పుట్టినివాడు మరణింపక తప్పదు. **"జాతస్యహిధృవో మృత్యుః"** అని, భగవద్గీత మరణశాసనం చేసింది. అందఱికి అనుభవంలో ఉన్న ఈ నిత్యసత్యాన్ని కాదని, మరణంలేని జీవనం కోరటం రాక్షసుల స్వభావం. ఆ వరాలు వరాలుగానే ఉండగా, వారినేదో రూపంలో మృత్యువు కబళిస్తుంది. తిరిగి జన్మలేకుండా చేయమని కోరటం సజ్జనుల సంస్కారం. మృత్యువు (యముడు) ఆసన్నమైనప్పుడు మేము ఇప్పుడే

సుఖాలననుభవిస్తున్నాం కొంతకాలం బ్రతికించమని బ్రతిమి లాడినా, అతడు కరుణింపడు. బాధలలో ఉన్నాం, రోగాలతో విసిగిపోతున్నాం, ముందుగా తీసుకెళ్ళమని వేడుకొన్నా వినడు. ఆ స్థితిలో చేసేవాళ్ళకు, చేయించుకొనేవాళ్ళకు బ్రతుకు భారం అవుతుంది.

ఏ జీవియైనా, కర్మానుభవం ఉన్నంతకాలం భూమిమీద ఉండవలసిందే. ఎప్పుడో చేద్దాంలే తర్వాత చూద్దాంలే అనుకోకుండా, తాను చేయవలసిన, చేయదలచిన ధర్మాన్ని (కర్తవ్యాన్ని) ఎంత త్వరగా చేస్తే అంతమంచిది. ఆ తర్వాత చింతించి ఏమీ ప్రయోజనం ఉండదు. ధర్మమనేది మాటలు చెప్తేనో, పుస్తకాలు వ్రాస్తేనో సరిపోదు. ఆచరించినప్పుడే పుణ్యఫలాన్ని, ఆనందాన్నిస్తుంది.



## త్యాగం

**శ్లో॥ త్వచం కర్ణః, శిబిర్మాంసం, జీవం, జీమూత వాహనః**
**దదౌ దధీచి రస్థీని, నాస్త్యదేయం మహాత్మనామ్॥**

**“ఇచ్చుటలో ఉన్న హాయి తెలిసిన మహాత్ములు”** కొందరు ఇతరులకు ఏదైనా, చివరకు ప్రాణాన్ని కూడా తామేమి ఆశించకుండానే ఇవ్వటానికి ఇష్టపడతారు. భారత స్వాతంత్ర్యోద్యమ రథసారథి మహాత్మాగాంధీ. ఆ కోవలోకి చేరిన వారే శ్రీ పొట్టిశ్రీరాములు గారు. ఆంధ్రరాష్ట్రావతరణం కొరకు అసువులను బాసిన అమరజీవి వారు. అంతకు ముందు అదే ఉద్దేశ్యంతో **నిరాహార దీక్ష చేపట్టి 33 రోజులు ఉపవసించిన మహనీయులు శ్రీస్వామి సీతారామస్వామి.** కావూరు వినయాశ్రమం కేంద్రంగా నడిచిందా ఉద్యమం। అట్టి సదాశయ సంపన్నుల స్ఫూర్తితో మన ఆంధ్రప్రదేశ్ అవతరించింది. త్యాగశీలురైన ఇట్టివారు **“ఎందరో మహానుభావులు వారికి అందరికి వందనములు”.**



ఫలితములు లభించును. కానప్పుడు ఆ సామర్థ్యము వ్యర్థమగును. పెద్దలయందు, పిల్లలయందు ఈ సంగతి పాటించవలసి ఉన్నది. మా అబ్బాయి లేదా అమ్మాయి ఫలానా విద్య, ఉద్యోగము జేసి తీరవలయునని పట్టుపట్టరాదు. వారికేరంగమున అభిరుచి కలదో వారి నావిషయములందు, ముందడుగు వేయుటకు, దోహదపడుట పెద్దలైన వారి కర్తవ్యము. అప్పుడే వారా విషయములందు రాణిస్తారు. కాని నాడు, వ్యతిరేక భావములు పెంపొందింపబడి, బ్రతుకు భారమై ఆత్మహత్యలకు దారితీస్తాయి.



# యోజన వలన ప్రయోజనముంటుంది.

**అమంత్రంమక్షరం నాస్తి, నాస్తిమూలమనౌషధమ్!**

**అయోగ్యః పురుషోనాస్తి యోజకస్తత్రదుర్లభః**

మంత్రము కాని అక్షరము లేదు – ఔషధగుణము లేని వృక్షమూలము లేదు. యోగ్యుడుకాని మానవుడు లేదు. ఎక్కడేవిశేషము ఉందో తెలిసి ఉపయోగించు కొనువాడు మాత్రము మిక్కిలి అరుదు. యోజకుటంటే, సమకూర్చువాడని అర్థం.

వాఙ్మయ ప్రపంచమునకు అక్షరములే ఆధారములు. అందు అకారాదులైన అచ్చులకు అమృతాది శక్తులు, కకారాది హల్లులకు కాళరాత్ర్యాది శక్తులు అధిష్ఠాన దేవతలుగా ఉన్నారని యోగశాస్త్రమున చెప్పబడుచున్నది. అందువలన ఏ అక్షరమునకు ఏ శక్తి అధిదేవతో తెలిసిన ఋషులు కొన్ని అక్షరములను ఒకటిగా చేర్చి, మంత్రములుగా కూర్చి, ఉపాసించి, వివిధ ప్రయోజనములను సాధించారు. శ్రీ లలిత, విష్ణు, శివ సహస్రనామాదులను మాలామంత్రములని వర్ణించారు. దేవీ భాగవతమునందు తెలివిలేని వాడొకడు ప్రకృతిలో వినవచ్చిన 'ఐం' అను అక్షరమును మననము చేయుట ద్వారా మహావిద్వాంసుడైనట్లు వివవరించబడినది. 'ఓంకారము' (ప్రణవము) అన్ని మంత్రములకు ముందు చేర్చి ఉపాసించుట జగత్ప్రసిద్ధము. ఈ వర్ణమాతృకోపాసన మంత్రసిద్ధికి, యోగసిద్ధికి మూలము.

మన పెరటిలో ఉండే తులసిచెట్టు మొదలు, ముళ్ళకాయలు ఉన్న ఉమ్మెత్త చెట్టు వఱకు చిన్నాపెద్ద అనుభేదము లేకుండా అన్ని వృక్షములందలి చిగురులు, ఆకులు, పూలు, కాయలు, పండ్లు, వేరులు, బెరడు మొ॥అన్ని భాగములు ఔషధములై ఉన్నప్పటికి, తెలియక మనమీనాడు గుర్తింపలేక పోతున్నాము. ఆయుర్వేద శాస్త్రమున ఆ విషయములు చక్కగా వివరింపబడినవి.

**"అయోగ్యః పురుషః"** అనుచోట 'పురుషుడు' అనునది మానవజాతి పర్యాయపదముగా చెప్పబడినది. స్త్రీ, పురుషులు అందరిలో ఏదో ఒక శక్తి, నేర్పు ఉంటుంది. అది గుర్తించి, ఆవిషయమునందు వారిని ప్రోత్సహించిన మంచి



పురాణ వాఙ్మయాన్ని పరిశీలించినప్పుడు కర్ణుడు చర్మాన్ని, శిబి మాంసాన్ని, జీమూతవాహనుడు జీవమును, దధీచి వెన్నెముకను ఇచ్చి త్యాగధనులుగా కీర్తింపబడ్డారు. వారి చరిత్ర స్ఫూర్తిదాయకమై సద్గేయమై తనరినది.

ఇంద్రుడు మారువేషంలో వచ్చి కవచ, కుండలాలను అడిగితే కాదనకుండా ఇచ్చినవాడు కర్ణుడు. దాని వలన కలిగే ప్రమాదాన్ని తెలిసి కూడా అతడు అందుకు సిద్ధపడ్డాడు. కపోతమును (పావురము) రక్షించడానికి శిబి చక్రవర్తి తన శరీరంలో మాంసాన్ని కోసిఇచ్చాడు. అది చూసి తనను పరీక్షించడానికి వచ్చిన దేవతలు ఆశ్చర్యపోయారు.

రాజకుమారుడు, జీమూతవాహనుడనేవాడు, నాగులను రక్షించడం కోసం గరుత్మంతునకు తనను తాను సమర్పించుకొనేందుకు సిద్ధపడ్డాడు. వృత్రాసురుని సంహరించడానికి, మహర్షి దధీచి, ఇంద్రునకు తన వెన్నుముకను ఆయుధంగా ఇచ్చాడు. వీరంతా ఘనులు, మహాత్ములు. ధర్మరక్షణ కోసం, లోక క్షేమంకోసం వారు చేసిన త్యాగాలు శాశ్వత కీర్తిని సంపాదించి పెట్టాయి. చరిత్రలో వారిని చిరంజీవులను చేశాయి. ఎవరెంత ధనం సంసాదించారు, ఎంతకాలం అధికారంలో కొనసాగారు, ఎంతమంది బిడ్డల్ని కన్నారు, మూటకట్టి వారికెంతెంత ముట్టజెప్పారు అనేది ముఖ్యంకాదని, త్యాగమొక్కటే అమృతత్వమునకు మార్గమని వేదములు ఉద్బోధిస్తున్నాయి.

**మం॥ నకర్మణా, నప్రజయా, నధనేన, త్యాగేనైకేన –**
**అమృతత్వమానసుః .....అన్నది శ్రుతివాక్యం.**

**ఘనులై యా శిబిమాంసమున్, గవచమాకర్ణుండు, జీమూతవా**
**హనుఁడున్ జీవము, లాదధీచి యెముకన్ త్యాగంబుఁగావించి ర**
**ర్థి ;నదేయం బెదియౌ మహాత్ములకు? సద్గేయంబు తన్మార్గవ**
**ర్తన; జీవాళికి త్యాగభావమును నేర్పన్ జాలి రాధన్యులే!!** (రచయిత)



# ప్రాజ్ఞుడు

**"కాలో జగద్భక్షకః"** భగవంతుని రూపమగు కాలమే జగమును కబళించును. ఈ భూమిమీద పుట్టిన ప్రతి ప్రాణీ మరణింపక తప్పదు. **"జాతస్యహి ధృవోమృత్యుః"** అని గీతలో భగవంతుడు ఈ విషయం కంఠోక్తిగా చెప్పాడు. మనం నిత్యం గమనిస్తున్న సత్యమిదే. కొద్దిగా ముందు-వెనుకలు మాత్రమే తేడా!

పూర్వం రాక్షసులు, చావులేని జీవితం కావాలని ఎన్ని విధాల ప్రయత్నించినా ఫలితం లేకపోయింది. బ్రహ్మాది దేవతలు, వారికి ఇచ్చిన వరాలు అలా ఉండగానే, విధి వారిని ఏదోవిధంగా హరించటం విన్నాం. ఈ ప్రపంచమే పంచభూతమయము. మార్పు దీనికి సహజం. ఈ సంగతి తెలిసిన బుద్ధిమంతుడు దేనికీ ఆరాట పడక, సమస్త ప్రకృతికీ మూలమైన భగవంతుని లీలలను గుర్తించి, స్మరించి, తరించాలి. తెలివిగలవారు బ్రతికినంతకాలం, ముసలితనం, మరణం అనేవి మర్చిపోయి; విద్యనూ, ధనమునూ సంపాదించాలి. భయపడుతూ జడంగా కూర్చుంటే, జరామరణములు తప్పవు సరికదా! జీవితంలో సాధించేదేమీ ఉండదు. తింటం, కంటం తప్ప . అందువల్ల ప్రతిక్షణమూ విద్యనూ, ప్రతికణమూ ధనమునూ సంపాదించాలి. నీడవలె అనుసరించే మృత్యువును నివారించటం సాధ్యం కాదు కనుక ఆ సంపాదించిన దానిని దాన ధర్మాలకు వినియోగించాలి. ఆ విధంగా చేసిన వారికి కీర్తి, పుణ్యము లభిస్తాయి. సమాజానికి శ్రేయస్సు సమకూరుతుంది.

**అజరామరవత్ ప్రాజ్ఞః విద్యామర్థంచ సాధయేత్ ।**
**గృహీతణవకేశేషుమృత్యునా, ధర్మవంచెరేత్ ॥**

ఆరామ ప్రతిష్ఠలు చేసి, సత్రాలు పెట్టి, చలివేంద్రాలు ఏర్పాటుచేసి, గుడిగోపురములు కట్టించి, బడులు పెట్టించి, వైద్య సౌకర్యములు కల్పించి, బావులు త్రవ్వించి, వారధులు నిర్మించి, జలాశయములు చేకూర్చి పెద్దలెందరో దేశాభివృద్ధికి పాటు పడ్డారు. ప్రాణాలు తృణప్రాయంగా వెచ్చించి దేశాన్ని శత్రువుల బారినుండి కాపాడారు. వారి జన్మ సార్థకం, వారి మనుగడ చిరస్మరణీయం అయ్యేలా చేశారు. అట్టివారు మరణించినప్పటికీ జీవించి ఉన్నట్లే, ఎందరో మహానుభావులు, వారందరికీ వందనాలు.



కంద : **పరమేశ్వరార్పితంబై**
**పరగెడు నర్థ మెదియేని పరమార్థంబై,**
**పరతత్త్వ యోగఘటనా**
**పరమగు నని పెద్దలెల్ల పలుకుదురెపుడున్!**

ఆ విశ్వాసంతోనే వారు తమ కావ్యాన్ని పరమేశ్వరునికి సమర్పించారు. మనం, ఎప్పుడు, ఎవరికి ఏమిచ్చినా, ఈశ్వరునికే ఇస్తున్నామన్న భావన కలిగి ఉ ఒడటం మనసంస్కృతిలో భాగంగా పెద్దలు అలవాటు చేశారు. **'గాలికి పోయేపేలపిండి కృష్ణార్పణ'** మని భావించటం ఒక సామెతగా వింటాం. ఆ భావనయే సత్ఫలమునిస్తుంది. ఈశ్వరుడిచ్చింది ఈశ్వరునికి ఇవ్వడమే ధర్మంకదా! హరిదాసు, పాత్రలోబియ్యం పోస్తే "కృష్ణార్పణం" అని కీర్తిస్తూ వెళ్ళిపోతాడు. మన కర్తవ్యాన్ని గుర్తుచేస్తాడు. ఇదే నిష్కామ కర్మగా వర్ణించారు పెద్దలు.



## త్రికరణశుద్ధి - సర్వకార్యసిద్ధి

కరణము అంటే సాధనమని అర్థం. శరీరం, వాక్కు, మనస్సు ఈ మూడింటినీ త్రికరణములంటారు. విద్య, ఉద్యోగం, వ్యవసాయం లౌకిక విషయాల అన్నింటిలోనూ, ఆధ్యాత్మిక జ్ఞానం పొందడంలోనూ ఈ త్రికరణాలు సహకరిస్తాయి.

స్నానం శరీరాన్ని, జపం (స్తోత్రం) వాక్కును, ధ్యానం మనస్సును శుద్ధి చేస్తాయి. ధర్మాచరణానికి ఉపకరిస్తాయి. మనస్సు నిర్మలమైనవేళ ఇంద్రియ నిగ్రహం ఏర్పడుతుంది. విషయసుఖాలను నిరసించిన (ప్రక్కన పెట్టిన) సాధకుడు తన ప్రయత్నంలో ముందుకు నడుస్తాడు. తపస్సుతో అంతరింద్రియములను అదుపులో ఉంచుకొని సత్య నిష్ఠుడై, ఉత్తముడుగా పరిణితి చెందుతాడు. అట్టివానికి పరమ పురుషార్థం (మోక్షం) సిద్ధిస్తుంది. మహాత్ములకు త్రికరణాలు ఒకటిగా ఉంటాయి. దురాత్ములకు భిన్నంగా ఉంటాయి. వారి బుద్ధి వక్రిస్తుంది. అందువల్ల వారు విశ్వసనీయులు కారు.

**శ్లో॥ మనస్యేకం, వచస్యేకం, కర్మణ్యేకం మహాత్మనాం।**
**మనస్యన్యత్, వచస్యన్యత్, కర్మణన్యత్, దురాత్మనామ్॥**

సమములుకాని, త్రికరణములను ఒకటిగా చేయటమే సాధన. పరమశివుని త్రిపురాసుర సంహారంలోని రహస్యమిదేనని పెద్దలు చెప్తారు. ఆ భగవదనుగ్రహంతో స్థూల, సూక్ష్మ, కారణ శరీరములను దాటి, విశ్వచైతన్యంలో చేరటానికి సాధకులు ప్రయత్నిస్తారు. వారికి మరుజన్మ ఉండదు. అందుకు సర్వస్వార్పణబుద్ధిని అలవర్చుకోవాలి. ఈ సంప్రదాయాన్ని పెద్దలనుసరించారు.

**శ్లో॥ కామేన, వాచా, మన సేంద్రియైర్వా,**
**బుద్ధ్యాత్మనావా, ప్రకృతై స్వభావాత్,**
**కరోమి యద్యత్, సకలం, పరస్మై,**
**నారాయణాయేతి సమర్పయామి॥**

పరమేశ్వరార్పణ బుద్ధితో చేసింది పరమార్థాన్ని కలుగజేస్తుందని, తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రిగారు తమ శ్రీరామకథాఽమృతంలో వివరించారు.



## కార్యశూరులు

**గచ్ఛన్ పిపీలికాఽపి సా సముద్ర మధిగచ్ఛతి!**
**అగచ్ఛన్ వైనతేయోఽపి పదమేకం నగచ్ఛతి!!**

వినతకు కశ్యపుని వలన పుట్టినవాడు గరుత్మంతుడు. వినత కుమారుడవటంచేత అతనికి వైనతేయుడని పేరు. అతడు మిక్కిలి బలము, వేగము గలవాడు. దేవగణములను నిర్జించి (జయించి) అమృతమును సంపాదించి తెచ్చి మాతృదాస్య విముక్తికై కృషిచేశాడు. ఇంద్రుని వజ్రాయుధానికి కూడా లోబడని బలమైన రెక్కలు గలవాడు. కావున అతడు సుపర్ణుడని కూడా కీర్తింపబడ్డాడు.

అమృతం చేతికి లభించినా, దాన్ని దుర్వినియోగం చేయని ఆతని ఉన్నత గుణములను మెచ్చుకొని విష్ణుమూర్తి వరములిచ్చి నిరంతరం సేవలందించే విధంగా తనకు వాహనంగాను, ధ్వజచిహ్నంగాను ఉండేందుకు అంగీకరించాడు. అందువలన శ్రీమహావిష్ణువు గరుడవాహనుడు, గరుడధ్వజుడుగా ప్రసిద్ధి పొందాడు.

అంతటి గరుత్మంతుడు కూడా కదలకుండా ఎక్కడ ఉన్నవాడు అక్కడే ఉంటే ఒక్క అడుగుకూడా ముందుకువెళ్ళలేడు. ప్రగతి సాధించలేడు. 'పిపీలికా అంటే చీమ. అల్పప్రాణి కావటంచేత అది మెల్లగా నడుస్తుంది. నడిచి, నడిచి చివరకు సముద్రం వఱకు ప్రయాణిస్తుంది. క్రియాశీలుడైనవాడు ఎంతటి అసాధ్యమైన పని అయినా సాధింప గలుగుతాడు. లక్ష్యాన్ని పొందగలుగుతాడు. గమ్యానికి చేరువఅవుతాడు. సోమరిపోతుకు లోకంలో ఏదీ సిద్ధించదు.

కనుక ప్రతి ఒక్కరు, **"మేం బలహీనులం. మేమేమీ చేయలేం. మాకేదీరాదు. మమ్మల్ని ఎవరూపైకి రానీయరు"** అని బేలగా వాపోవటం సరికాదు. ఉచితావకాశాలు ఇవ్వండంటూ రిజర్వేషన్‌లు అర్థించడం నైతికతా కాదు. ఎవరిధర్మాన్ని వారు పాటిస్తూ, కర్తవ్యాన్ని నిర్వర్తిస్తూ ముందుకు సాగిపోవటం నేర్చుకోవాలి. ఉత్సాహంతో కృషిచేసి సాధించలేనిది ఏదీలేదని సీతాన్వేషణలో హనుమంతుడు నిరూపించాడు. ఆయనే కార్యసాధనలో అందరికి ఆదర్శం. అనిర్వేదశ్శ్రియోమూలం "అనిర్వేదేహి సతతం, సర్వార్థేషు ప్రవర్తకః".

# సార్థకం

శ్లో॥ వేద విదేః కిల దత్తం దత్తం
**బంధుజనైస్సహ భుక్తం భుక్తం!**
**భార్యయాసహ సుప్తం సుప్తమ్**
**అన్య దదత్త మభుక్త మసుప్తమ్!!**

వేద వేత్తలకిచ్చినదే నిజమైన దానము. బంధు జనులతో కూడి భుజించినదే భోజనము. భార్యతో కలసి నిద్రించుటే సుఖమైన నిద్ర. అట్లు కాని దాన, భోజన, నిద్రాదులు నిరర్థకములని పెద్దల నిర్ణయము.

**"వేదోఽఖిలోధర్మమూలమ్"** వేదము సకల ధర్మములకు మూలము. భగవంతుని ఉచ్ఛ్వాస నిశ్వాసములే వేదములు. **యస్య నిశ్వసితంవేదః ।** నిరంతర తపోయోగనిష్ఠులైన ఋషులు ఆ సత్యమును గ్రహించి వానిని శ్రుతులుగా ఆవిష్కరించారు. వినపడినవి కావున వేదములకు శ్రుతులని ప్రసిద్ధి కలిగినది. లోకకళ్యాణ హేతువులైన సనాతన ధర్మములు, అందు వివరింపబడినవి. అవి ఋక్, యజుస్, సామ, అధర్వణములుగా విభజింపబడి ఆయా ప్రయోజనములకై ఆయా సందర్భములందు ఉపయోగింపబడుచున్నవి. వేదము స్వరప్రధానము. ఉదాత్త – అనుదాత్త – స్వరితాదులు చక్కగా పలికినప్పుడు వేదమునకు సార్థకత లభిస్తుంది. ఇట్టి వేద వాఙ్మయము అనంతము. అందు చెప్పబడిన ధర్మములు జగద్ధితమును కలిగిస్తాయి. శ్రీ విద్యారణ్యుల వారు వేదమునకు భాష్యము వ్రాసి లోకమునకు మహోపకారము చేసారు. ఒక వేదమును అభ్యసింపవలెనన్న పన్నెండు సంవత్సరములు తదేక దీక్షతో సద్గురువులను ఆశ్రయించిన గానీ సాధ్యపడదు. అట్టి వేదవేత్తలను గౌరవించుటకు సంస్కారవంతులైన పెద్దలు కొందరు ఈనాడు ప్రయత్నించుట సంతోషదాయకమైన విషయము. ఇటీవల సమాజహితులైన మిత్రులు కొందరు రాంభొట్లపాలెంలో యాజ్ఞవల్క్య జయంతి సందర్భముగా వేద వేత్తలను గౌరవించి, మంచి సంప్రదాయమునకు శ్రీకారమును చుట్టినారు. ఆ వేదము శివస్వరూపము.



త్రిగుణాలకు ప్రతీకగా, త్రిశక్తుల మూలమై, లోకోపకారకమైన సూర్యునకు నమస్కరించడం భారతీయ సంస్కృతి. మనదేశంలో ఇప్పటికీ అన్ని ప్రాంతములలో, అన్ని కులాలలో, అన్ని వర్ణాలలో ఉదయాన్నే సూర్యునికి నమస్కరించే పద్ధతి పాటింపబడుతున్నది. ఈ సూర్యుని, తమ బుద్ధి, శక్తులు వికసింపచేయుమని ద్విజులు గాయత్రిగా ఉపాసిస్తారు. గాయత్రి బ్రహ్మాస్త్రంగా ప్రసిద్ధమైంది. నేడు కొందరు ఈ సత్యాన్ని గుర్తింపకపోవడం దురదృష్టం. సౌరశక్తిని ఈనాడు మనం అనేక విధాలుగా వినియోగించుకొంటున్నాం. శక్తిమంతుడైన సూర్యునికి కృతజ్ఞతతో నమస్కరించటానికి కొందఱు ఇష్టపడటంలేదు.

**"పూజయస్వ వివస్వన్తం, భాస్కరం భువనేశ్వరం"** అని అగస్త్యుడు ఆదిత్య హృదయంలో, శ్రీరామునకు ఉపదేశించాడు. విజయారోగ్యాలను ప్రసాదించేవాడు సూర్యుడు. పెద్దలు **"ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్"** అని చెప్పారు. అతడు నమస్కార ప్రియుడు. అందువల్ల మన పెద్దలు, సూర్యుడు దట్టమైన మబ్బుల మాటున ఉండి, మనకు దర్శనమీయని రోజును దుర్దినంగా పరిగణించారు. కొందరు ఆ రోజున భోజనం కూడా చేయరు. అది ఒక వ్రతంగా పాటించేవారు ఇప్పటికీ కొందరున్నారు. అంతటి శక్తిసంపన్నుడైన సూర్యునికి రథసప్తమినాడు దీపం చూపించి, పొంగలి నివేదించి, నమస్కరించడం సంప్రదాయం. అది భారతజాతి సంస్కారాన్ని, కృతజ్ఞతను తెలియచేస్తుంది. ఈ పద్ధతి జాతీయతా భావాన్ని పెంపొందిస్తుంది.



## త్రిగుణములు

సత్వము, రజస్సు, తమములను మూడు గుణాలు త్రిగుణాలు. సృష్టి, స్థితి, లయములకు ఈ త్రిగుణాలే కారణాలు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు త్రిగుణాలకు ప్రతీకలు. ప్రపంచంలో గల సర్వ వస్తువులలోనూ ఈ త్రిగుణాలు చోటు చేసుకుంటాయి. పాళ్ళలోగల తేడానుబట్టి మంచి, చెడులుగా పరిగణింపబడతాయి.

ఉదాహరణకు ఒక వ్యక్తిలో నూటికి 50పాళ్ళు సత్వగుణం, 30పాళ్ళు రజోగుణం, 20పాళ్ళు తమోగుణం ఉన్నట్లతే వారు, సత్వగుణ ప్రధానంగలవారుగా ప్రసిద్ధి పొందుతారు. తక్కిన గుణాల విషయం కూడా ఈ విధంగానే ఊహించుకొని తెలియతగి ఉంది. ఈ గుణాలను గుర్తించే పద్ధతిని భారతం ఈ క్రింది విధంగా నిరూపించింది.

**అసుఖా కారత, నిద్ర, దైన్యము, విమోహం బక్షమత్వంబు, తా**
**మస భావంబులు; రాగలోభ జడతా మానంబు లూహింప రా**
**జస వృత్తంబులు, ధైర్య, శాంతి కరుణా, సంతోష విద్యాదు లిం**
**పెసఁగన్ సాత్త్విక చేష్టితంబులు, నిజంబిట్లాత్మ గన్మింతయున్ !**

*(అర: 5వ ఆ: 97ప)*

ఇందులో తమోగుణం అతి మోహమయమై నిందింపదగి ఉంటుంది. సత్వగుణం లోకంలో సద్గుణాలతో వివేక, ప్రకాశములను కలిగి ఉంటుంది. ఉభయ గుణాలు కలది రజోగుణం. అహంకారాన్ని సూచిస్తుంది.

అందరికీ ప్రత్యక్ష దైవమైన సూర్యుడు, ఈ మూడు గుణాలనూ కలిగి విశ్వానికి ఆధారమై ఉన్నాడు. అతని వల్లనే సృష్టి, స్థితి, లయలు కగులుచున్నాయి. ఉదా॥ సూర్యునిలోని ఉష్ణశక్తివల్ల మొక్కలు మొలుస్తాయి, పోషింపబడతాయి. ఎండతీవ్రతకు నశించిపోతాయి.

**శ్లో॥ ఉదయం బ్రహ్మస్వరూపం, మధ్యాహ్నేతు మహేశ్వరః ।**
**సాయంకాలే సదా విష్ణుః, త్రిమూర్తిస్తు దివాకరః ॥**



వేదవేత్తలను గౌరవించుట శివారాధనమే అగును. అట్టి వేదవేత్తలను గౌరవించిన గౌరవమే నిజమైన గౌరవము. వారికిచ్చిన ధనము, సార్థకము. అదియే సత్పాత్రదానము.

బంధువులనగా దాయాదులు మొదలైనవారు. వారందరితో కలసి భుజించుట (అనగా వారు అన్నవస్త్రములకు కొదువ లేకుండా జీవించునట్లు చూచుట) ఉత్తమము. దాయాదులైన బంధుజనులను పట్టించుకొనక, పదుగురను భుజింపచేసిననూ ప్రయోజనము లేదు. వారికి పెట్టినది. వారితోడి తిన్నది. నిజమైన భోజనము కానేరదు.

సంసార జీవితంలో భార్యతో కలిసి ఉండుటయే ఆరోగ్యము, ఆనందము. భార్యను కాక, అన్యులనాశ్రయించి జీవించుట అనర్థదాయకము. అంతేకాక ఆరోగ్యభంగము మరియు అది అసాంఘిక జీవనమే అగును.

ఇవి అన్నియూ మానవుల సాంఘిక జీవన విధానమును బాధ్యతను, ఆరోగ్య సూత్రమును తెలియజేయు సుమధుర సూక్తులు.



# స్వభావం

ప్రకృతిలో కాకినల్లగా వుంటుంది. కో(కి)యిలానల్లగా వుంటుంది. ఈరెండిటికి భేదమేమిటి? ఎలాగుర్తించడం? అనే సందేహం ఏర్పడుతుంది. వసంత కాలం రాగానే కోయిలలు గొంతెత్తి మధురంగా మనోహరంగా పాడుతూ శ్రోతలను పరవశింపచేస్తాయి. స్వర భేదంతోనే కాకి కాకిగా, కోయిల కోయిలగా గుర్తింపబడుతుంది.

శ్లో॥ **కాకః కృష్ణః, పికః కృష్ణః; కోభేదః పిక కాకయోః ।**

**వసంతకాలే సంప్రాప్తే, కాకః కాకః, పికః పికః ॥**

లోకంలో మధుర భాషణంవలన మర్యాదలభిస్తుంది. కటువుగా, కఠినంగా మాట్లాడితే కాకిగోల అని కసురుకుంటారు. రాళ్ళతోతరిమి కొడతారు. ఈ విషయాన్నే **కరుణశ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు** తెలుగు బాల శతకంలో

**ఆ॥వె॥ కోకిలమ్మ జేసుకొన్న పుణ్యంబేమి?**

**కాకి జేసుకొన్న కర్మమేమి?**

**మధుర భాషణమున మర్యాద లభియించు**

**లలిత సుగుణజాల! తెలుగుబాల!**

అంటూ వివరించారు **"నోరు మంచిదైతే ఊరు మంచిదవుతుం"**దని పెద్దలు చెప్పిన మాటలో సత్యం ఉంది. **"నోరా! వీపుకు దెబ్బలు తేకే"** అని హెచ్చరించిన సంగతి తెలిసిందే కదా!

భౌతికంగా మానవులంతా ఒకటిగా ఉన్నా, వారిలో విద్యచేత, వివేకంచేత, గుణంచేత, బలంచేత, ధనంచేత, అధికారంచేత అభిరుచులచేత, వయస్సుచేత, మనస్సుచేత భేదం వుంటుంది. ఈ వైవిధ్యమే ప్రకృతియొక్క గొప్పదనం. స్త్రీ పురుష భేదమే సృష్టి రహస్యం.

సమాజంలో మనుషులంతా పైకి ఒకేవిధంగా కనబడుతున్నా, అంతరాలలో తేడాలుంటాయి. సమయం వచ్చినపుడు వారి నైజం వ్యక్తమౌతుంది. "పురుషులందు పుణ్యపురుషులు వేరయా" అని వేమన చేసిన ప్రకటనలోగల యథార్థంయిదే.



దయాస్వభావులు అయిన యాజ్ఞవల్క్యాదులు **శ్రీకృష్ణబోధామృతాన్ని** అందించారు. ఆ పరమ–ఔషధాన్ని గ్రోలినవారికి మోక్షం తప్పక సిద్ధిస్తుంది. జన్మ, జరా, విపత్తి, మరణాలు ఇంక కలుగవు. అట్టి గురు పరంపరకు నమస్కారాలు. నిద్రలో ఉన్నవారికి ఏమీ తెలియనట్లే సంసారంలో మునిగి భగవచ్చింతన మరచినవారికి పరతత్వాన్ని గూర్చి ఏం తెలియదు. గురువులు వారి కళ్ళు తెరిపిస్తారు. మంచిదారి చూపి, తరింపచేస్తారు. పై అర్థం కలిగిన క్రింది శ్లోకం చూద్దాం....

**హే లోకాశ్శృణుత, ప్రశూతి మరణ వ్యాధేః చికిత్సా మిమాం**

**యోగజ్ఞాః సముదాహరన్తి మునయో యాం యాజ్ఞవల్క్యాదయః**

**అంతర్జ్యోతి, రమేయ, మేక మమృతం కృష్ణాఖ్య మాపీయతాం**

**తత్పీతం పరమౌషధం వితనుతే నిర్వాణ మాత్యన్తికమ్ ॥**



## ముందుగానే జాగ్రత్తపడాలి

దాహం వేసినప్పుడు బావి తవ్వడం సాధ్యపడుతుందా? ప్రాణం పోయేముందు భగవంతుని స్మరణం కలుగుతుందా? అందువల్ల ఆ ప్రయత్నం ముందే జరగాలి. ముకుందమాలలో కులశేఖర ఆళ్వారులు కృష్ణుని ఇలా ప్రార్థించారు.

**శ్లో॥ కృష్ణ! త్వదీయ పద పంకజ పంజరాన్త**
**మద్యైవ మే విశతు మానస రాజహంసః ।**
**ప్రాణ ప్రయాణ సమయే కఫ వాత పిత్తైః**
**కంఠావరోధన విధౌ స్మరణం కుతస్తే ।**

"నా మానస రాజహంస ఈ రోజే నీ పదపంకజ పంజరంలో బంధింపబడి, నీ ఆశ్రయము పొందుగాక! ప్రాణ ప్రయాణ సమయంలో కఫ, వాత, పిత్తములు మొ॥నవి ప్రకోపించి కంఠం పూడుకుపోగా దివ్యమైన నీ నామస్మరణం సాధ్యంకాదు కదా! అవసాన దశలో నిన్ను స్మరిద్దామనుకోవడం వట్టి భ్రమయే!" అన్నది పై శ్లోక తాత్పర్యం.

ఈ శరీరం పరిణామశీలం కలదై, సంధి బంధములు విడివడి క్రుంగి కృశించి ఏనాడో తప్పక నశించిపోవుట తథ్యం. ఇతర ప్రయత్నాలు మాని నిరామయమగు కృష్ణ రసాయనం సేవింపుము! మరుజన్మయను వ్యాధినుండి బయటపడగలవు. ఇది అందరికీ అనుభవంలోగల విషయమేకదా! పెద్దలను చూస్తున్నాం, వారితో కష్టాలు అనుభవిస్తున్నాం.

**శ్లో॥ ఇదం శరీరం పరిణామ పేశలం ।**
**పతత్యవశ్యం శ్లథ సంధి జర్జరం ॥**
**కిమౌషధైః క్లిశ్యసి, మూఢ! దుర్మతే ।**
**నిరామయం కృష్ణ రసాయనం పిబ ॥**

జన్మనిచ్చేవారు తల్లిదండ్రులైతే, జ్ఞానజన్మనిచ్చేవారు గురువులు. ప్రతిభా సంపన్నులు, భగవదనుగ్రహ పాత్రులు, యోగిపుంగవులు, సుజ్ఞాన నిధులు,



గొప్పగాచెప్పబడే వ్యక్తులలో కొందరికి మాటకటువుగా వుంటుంది. మెత్తగామాట్లాడేవారిలో కొందరు మోసగాళ్ళు వుంటారు. చూడగానే ఎవరెటువంటి వారని తెలియటం కష్టం. సమయం వచ్చినపుడు మాత్రమే అట్టివారి అసలు రంగు (స్వభావం) బయటపడుతుంది.

సామాన్యంగా చూసినపుడు అందరూ ఒకటిగా వున్నట్లు కనబడతారు. కానీ జనంలో ఎరుపు, నలుపు, పొట్టి, పొడవు, లావు, సన్నం, బలం, బలహీనత, సంతృప్తి, అసంతృప్తి, సహనం, అసహనం, విద్య–అవిద్య మొదలైన తేడా లుంటాయి. సంస్కారాలు, జీవనవిధానాలు వేరుగా వుంటాయి. వాటి ఫలితాలు కూడా భిన్నంగా వుంటాయి. అందటిని ఒకగాటన కట్టేయలేం. నాలుగు కాళ్ళు ఉన్నంతమాత్రంచేత గాడిదను, గుఱ్ఱాన్ని ఒకటిగా లెక్కించనూలేం. ఎవరిపని వారు చేయాల్సిందే. ఒకరిపని ఒకరు చెయ్యబోతే అస్తవ్యస్తత చోటు చేసుకుంటుంది.

కోయిల తన గుడ్లను తాను పొదగలేక కాకిగూటిలో వుంచుతుంది. కాకి తన గుడ్లే అనుకొని వాటిని కూడా పొదుగుతుంది. అందువల్ల కోయిలలను పరభృతములు అంటారు. పుట్టిన తరువాత స్వరం ద్వారా ఎవరి ప్రత్యేకత వారు నిలుపుకుంటారు. ఎవరివిశిష్టత వారికుంటుంది. అదే ప్రకృతి స్వభావమని తెలిసినవారు సహనాన్ని, సర్దుబాటు తనాన్ని కల్గి వుంటారు. అవి లోపించినవారు కలహించుకుంటారు.



## శరీర వినియోగం

**శ్లో॥ అనిత్యాని శరీరాణి, విభవోనైవ శాశ్వతః॥**

**నిత్యం సన్నిహితోమృత్యుః, కర్తవ్యంధర్మసంగ్రహః॥**

**"శీర్యతే ఇతిశరీరః"** అను వ్యుత్పత్తిని బట్టి క్షీణించిపోవటం శరీరలక్షణంగా పెద్దలు చెప్పారు. జీవి పుట్టటం ఎంత సహజమో మరణించటం అంతే సహజం. జీవితంలో తనకు లభించిన ధన, బల రూపమైన సంపద, అధికారము శాశ్వతంగా ఉండవు. మృత్యువు నిత్యం సన్నిహితమై ఉండటం సత్యం. ఇన్ని విషయాలు తెలిశాక, ధర్మమాచరించటం జీవుల కర్తవ్యమని బోధిస్తుంది పై శ్లోకం.

పంచభూతములతో ఏర్పడిన ఈ శరీరం ఎప్పుడైనా పచ్చికుండవలె విచ్చిపోతుంది. నిలకడలేనిదై అది, తిరిగి ఆ పంచభూతములలోనే కలిసిపోతుంది. సంపదలు ఎలా వస్తాయో తెలియదు సరికదా! పోయేటప్పుడు తెలియకుండానే హరింపబడతాయి. పరిణామక్రమంలో బండ్లు ఓడలు, ఓడలు బండ్లు అవుతాయి. రాజుకింకరుడవుతాడు, కింకరుడు రాజవుతాడు. ఇది లోకసహజం.

వర్ణాశ్రమవిధులలో ఎవరికి నిర్దేశింపబడినవి, వారు నియమబద్ధంగా చేయడమే కర్తవ్యం. దీనినే ధర్మము అన్నారు. ధర్మాచరణకు శరీరం కావాలి. తక్కిన జీవులకంటే మానవులకు తమ శరీర నిర్మాణము విశిష్టంగా ఉండటం వలన, (నడుము నిటారుగా నిలుపగల శక్తితో కూడినదగుటచేత) భావవ్యక్తీకరణకు కావలసిన శబ్దాన్ని (స్వరపేటిక ఏర్పరచి ఉండటం వలన) పలకటానికి, ఈ శరీరం నిలచి ఉండగానే, మానవులు చేయదగిన సాధనచేసి, చేరదగిన గమ్యం చేరాలి. ఆ పనిచేయలేనినాడు, పునర్జన్మతప్పదు పశువునకు, మానవునకు భేదం ఉండదు. తినటం, కనటం తప్ప ఎసాధించేది ఏదీ ఉండదు.

మనిషి మనిషిగా ఉంటూ, మనీషి కావాలంటే ధర్మాచరణ చేయాలి. అధ్యయన, అధ్యాపనములకు; దానప్రతిగ్రహములకు తీర్థక్షేత్ర సందర్శనమునకు; క్రతు, వ్రత–ఆచరణమునకు; యజ్ఞయాగాది నిర్వహణకు, దీక్షా, దక్షతలకు, విజ్ఞాన సాధనకు, విన్నూత శోధనకు మానవ శరీరం ఉండితీరాలి. ఇతర జంతుజాలానికి



## చిత్రం చూస్తుంటే, నవ్వొస్తుంది

**శ్లో॥ జీవనగ్రహణే నమ్రాః గృహీత్వా పునరున్నతాః ।**

**కిం జ్యేష్ఠాః కిం కనిష్ఠాః వా, ఘటీ యంత్రస్య దుర్జనాః ॥**

మెట్టపొలాలకు దిగువ కాలువ నీరందడం కష్టం. అలాంటప్పుడు బావులనో, దొరవులనో ఆశ్రయించాలి. అక్కడ వాడే యంత్రాన్ని **'ఏ తాము'** అంటారు. దీన్నే సంస్కృతంలో ఘటీయంత్రం అన్నారు.

**ఎత్తిపోతల పథకం :** లోతట్టు ప్రదేశంలో ఉన్న నీటిని తోడి, పైకి తెచ్చి, మెరకలో ఉన్న పొలాలకు నీరందించడం, ఆ యంత్రాలు చేసే పని. బావులలో ఎక్కడో పాతాళానికి జేరిన నీటిని మోటవేసి ఎద్దులు కాడికికట్టి, నీరుతోడి, తోటలు పెంచటం ఇప్పటకీ రాయలసీమ ప్రాంతంలో చూస్తూనే ఉంటాం. వాటిని మోట బావులు అంటారు. పూర్వం కొండవీడు ప్రాంతంలో కూడా, త్రాగు నీరు తోడుకోవాలంటే చాలా కష్టపడాల్సిందే అని చెప్పేవారు. ఇప్పుడు సాగరు జలాలు వచ్చి ఆ కొఱతను కొంతలో కొంత తీర్చాయి. అందుకే **కొండవీడు చేంతాడంత** అని, ఆ పొడవును సూచించేవారు. నీరు చేదుకొనేతాడు చేంతాడు.

**'ఏతాము'** నీటిని తీసుకొనేటప్పుడు క్రిందికి వొంగుతుంది, తర్వాత పైకిలేస్తుంది. ఈ సంఘటన చూసిన కవికి ఒక చిత్రం మనస్సుకు తోచింది. దుర్జనులు కూడా అతి వినయాన్ని ప్రకటించి బ్రతుకు తెరువు (డబ్బు) సంపాదించుకొని ఆపై తలఎగరేస్తారు. అది వారి స్వభావం. వారికి కృతజ్ఞత అనేది ఏ కోశాన ఉండదు. ఇట్టి వారిని గుర్తించటం చాలా కష్టం. జీవిత అనుభవం, నిశిత పరిశీలన, వలన మాత్రమే అది సాధ్యమౌతుంది. తెలియని అమాయకులు మోసపోతున్నారు. పై శ్లోకంలో 'జీవనం' అనే పదానికి, నీరు, బ్రతుకుతెఱువు అనే నానార్థాలు ఉండటం వల్ల ఈ చమత్కారం సిద్ధించింది. ఇదే సంస్కృతంలో ఉన్న గొప్పతనం. నిజమాలోచిస్తే, **'ఏతాము'** ఉన్నచోట నీరు తీసుకొని, లేనిచోట కొఱతతీరేలా ఇస్తుంది. దుర్జనులు, స్వార్థంతో పోగుచేసుకొనుటే కానీ, ఇతరులకిచ్చుటనునది ఎఱుగరు, ఈ విధంగా చూసినప్పుడు తల ఎగరవేయటంలో మాత్రమే పోలికగానీ, ఇతరత్రాలేదు. **'ఏతాము',** త్యాగాన్నీ, దుర్జనులు భోగాన్ని మాత్రమే పరమ లక్ష్యంగా పెట్టుకుని ప్రవర్తిస్తారు.

తెచ్చిపెడతాయి. అందువలన అందరూ విద్యావంతులు కావాలి. పుస్తకాలలో మాత్రమే ఉండి, అనుభవానికి రానివి ఉపయోగపడవు. విశేష ప్రయోజనాన్ని చేకూర్చవు. ధనం కూడా అంతే. ఇతరుల వద్ద ఉన్నది సమయానికి అందదు, అవసరానికి ఉపయోగపడదు. అందుకే పెద్దలు పుస్తకాలలో ఉండి నోటికిరాని విద్య విద్యకాదు, ఇతరుల చేతులో ఇరుక్కుపోయిన ధనం ధనంకాదు అనే మంచి మాట చెప్పారు. వింటే బాగుపడతాం. లేకుంటే చెడిపోతాం.

**శ్లో॥ పుస్తకేషుచ యావిద్యా, పరహస్తేచ యద్ధనం ।**
**సమయేతు పరిప్రాప్తే, నసావిద్యా నతద్ధనమ్ ॥**

పై శ్లోకంలో, **"కార్యకాలే సమప్రాప్తే॥"** అనే పాఠం కూడా లోకంలో వినబడుతోంది. అది అక్షరాలలో మార్పేకాని అర్థంలో తేడాలేదు, సందేశం ఒక్కటే. నేర్చిన విద్యలో నిపుణులై నిష్ణాతులై ఉండాలి, ధర్మాన్ని ఆచరించాలి, ఆ ధర్మమే మనల్ని రక్షిస్తుంది.

**తానెఱిగిన విద్యన్నపా**
**స్థాములో నెఱప కీర్తి సమకూరుంగా పరవిద్యా**
**ధీనత భూపాల సఖలతేజముకలదే!**
**(ధూర్జటి - శ్రీకాళహస్తి మహత్యము)**





సాధ్యంగాని ఇటువంటి గొప్ప పనులన్నీ చేయటానికి అనువైనది ఈ శరీరం మాత్రమే. ఇది ఉండగానే ధర్మకర్మముల నడపగలగాలి. మృత్యువు ఆక్రమించక పూర్వమే అశాశ్వతమైన ఈ శరీరంతో, శాశ్వతమైన పనులు చేసి, బ్రహ్మమును చేరుకోవాలి. **"దీపం ఉండగానే ఇల్లు చక్కపెట్టుకో"** అన్న మాటకిదే అర్థం. పరమార్థం.



## దుర్లభములు

లోకంలో దానం చేయడమే గొప్ప. కాదనలేం. దానం చేసేవారికి "నేనుగనుక చేస్తున్నాను, ఇంకెవ్వరూ చేయలేరిలా" అనే భావం మనసులోకి రాగానే, అది మాటల్లోనో చేతల్లోనో వ్యక్తం చేయడం జరుగుతుంది. మేఘం గర్జించి కదా వర్షిస్తుంది. అది ప్రకృతిధర్మం. దానం ప్రియమైన వాక్కులతో కూడినప్పుడది పరిపూర్ణ మానవతను సంతరించుకుంటుంది.

విషయం తెలిసి ఉండడం జ్ఞానం. అట్టివారికి అదిలేని వాళ్ళను చూస్తే చులకన భావం ఏర్పడుతుంది. ఉన్నవాళ్ళకు గర్వం కలుగుతుంది. గర్వం నెత్తికెక్కితే చెయ్యరాని పనులు చేస్తాడు. తన పతనం తనే కొనితెచ్చుకొంటాడు. ఆ జ్ఞానం సమాజహితానికి వినియోగిస్తే మేలు జరుగుతుంది.

శౌర్యమున్నచోట శాంతముండదు. దుందుడుకుతనంతో ముందుగా కయ్యానికి కాలు దువ్వుతాడు. తనకన్నా గొప్పవాడు ఎదురైనప్పుడు బొక్కబోర్లా పడతాడు. పరాజయం పాలవుతాడు. శాంతికి సౌఖ్యానికి దూరమౌతాడు. రామాయణంలో వాలి దుస్సాహసం ఇందుకు ఉదాహరణగా చెప్పుకోవచ్చు.

దైవదత్తమైన విత్తా(ధనం)న్ని ముడిమీద ముడివేసి మూటకట్టడానికే ప్రయత్నంచేస్తాడు. కానీ ఉదారంగా 10మందికి ఉపయోగపడే పనిచెయ్యడు. లోకంలో త్యాగానికే చరిత్ర, భోగానికి చరిత్ర లేదు.

మంచిమాటలతో దానం, గర్వంలేని జ్ఞానం, ఓర్పుతో కూడిన పరాక్రమం, త్యాగంతో కూడిన ధనం లోకంలో ఈ నాలుగు చాలా దుర్లభములు. ఎక్కడో అరుదుగా లభిస్తాయి. అట్టివాడు మహాత్ముడని కీర్తించబడతాడు.

శ్లో॥ దానం ప్రియవాక్యసహితం, జ్ఞానం మగర్వం, క్షమాన్వితం శౌర్యం।
విత్తంచ త్యాగ నియుక్తం దుర్లభమేతచ్చతుర్భద్రమ్॥

ఈ సృష్టిలో ఉన్న ప్రాణికోటిలో, మానవజన్మ ఉత్కృష్టమైనది. నిరంతరాన్వేషణలో శబ్దస్వభాన్ని గుర్తించి, అక్షరరూపాన్ని కల్పించి వాఙ్మయప్రపంచాన్ని ఏర్పరచుకొని జ్ఞాన, విజ్ఞానమార్గంలో పయనించి ఉన్నతిని సాధించారు, విద్యావంతులైన మానవులు. తనకు, సమాజానికి అభ్యుదయాన్ని కలిగించేది విద్య. సహనాన్ని కోల్పోయి, అహంకారాన్ని పెంచుకొంటే అది వివాదానికి దారితీస్తుంది. వినాశనానికి కారణమవుతుంది.

## వెంటవచ్చేది ధర్మమొక్కటే

లోకవ్యవహారంలో వస్తువినిమయం కొఱకు, ఏర్పరచుకొన్నది ధనం. సాలీడు తాను ఏర్పరచుకొన్న గూటిలో తాను బందీ అయినట్టు, మానవులు కల్పించుకొన్న ధనం, వారినే బందీలను చేస్తోంది. ఈ సకల చరాచర జగత్తును సృష్టించిన భగవంతుని తెలుసుకొనేందుకు అడ్డుగా నిలుస్తోంది.

అందరిలోను ఒకశక్తి ఉంటుంది. అది శారీరక, మానసిక చైతన్యానికి దోహదంచేస్తుంది. ఆశక్తి, ధర్మరక్షణకు, లోకరక్షణకు ఉపయోగించినప్పుడు సుఖములు, శుభములు కలుగుతాయి. ప్రకృతి విరుద్ధంగా ప్రవర్తిస్తూ, ఇతరులను బాధించటానికే పూనుకొన్నప్పుడు వినాశహేతువు అవుతుంది. ఆ రాక్షస లక్షణం.

విద్య విజ్ఞానానికి, ధనం దానానికి, శక్తి ధర్మరక్షణకు ఉపయోగపడేవి. అది సజ్జనల విషయంలో సాధ్యపడుతుంది. దురాలోచనతో గొందఱు, స్వార్థపరులై విద్యను వివాదానికి, ధనాన్ని అవినీతికి, శక్తిని, ఇతరులను పీడించటానికి వినియోగిస్తున్నారు. వారు, దుష్టులు, దురహంకారులు, దుర్వినీతులుగా పరిగణంప బడుతున్నారు. ఈ విషయాన్ని పెద్దలు ఇలా వివరించారు. విజ్ఞులిది, గ్రహించి ప్రవర్తిస్తారని ఆశించారు.



## ప్రగల్భముల వలన ప్రయోజనం లేదు

ఒక ఊళ్ళో ఒకాయన కొద్దిపాటి క్షుద్ర విద్య నేర్చుకుని, ఊరికి ఉపకారం చేయటం మానేసి, అందర్ని బెదిరిస్తూ, భయపెడుతూ కేవలం ధనార్జనతో కాలం గడపటం మొదలుపెట్టాడు. కొన్నాళ్ళకు(కొన్నేళ్ళకు) ఆ ఊరికి ఏదోపనిమీద మహాత్ముడొకడు వచ్చాడు. ధర్మానుస్ఠానం కొఱకు ఊరిచివర బావి దగ్గర స్నానంచేసి సంధ్య వార్చు కొంటున్నాడు. బ్రాహ్మణులకు గాయత్రియే, బ్రహ్మాస్త్రము.

ఈ వార్త ఆ మూర్ఖ శిఖామణికి తెలిసింది. తనకు తెలియకుండా, తన అనుమతి లేకుండా బావిలో నీరు ముట్టుకున్నందుకు ఆ వచ్చిన మహానుభావుణ్ణి నిందించి, నిన్నేమి చేస్తానో చూడమని బిభీషికలు పలికాడు. ఆ దుర్మార్గుడు చేసిన శక్తిప్రయోగం ఆ పుణ్యాత్ముణ్ణి ఏమీ చేయలేకపోగా, అతనినే తుదముట్టించింది. వినాశకాలం ఆసన్నమైనపుడు అకారణవైరం వంటి విపరీతబుద్ధులు ఏర్పడుతాయని పెద్దలు చెప్పిన మాటకు తాత్పర్యమిదేకావచ్చు. ఆచరణ లేకుండా మే మింతవారం, అంతవారం అని చెప్పుకున్నందువల్ల ప్రయోజనంలేదు.

తెల్లవారేసరికి ఆ దుష్టుడి మరణం ఊరి వారందరికి తెలిసింది. అచటి జనం బాగా ఆనందించారు. ఆ వచ్చిన పెద్దమనిషి తనపని ముగించుకుని ఆయన దోవన ఆయన వెళ్ళిపోయాడు. ఇక్కడ జరిగిన సంగతులేవి ఆయనకు తెలియవు.

ఆ తరువాత వారి కుమారుడు ఊళ్ళోవాళ్ళని చూసి 'మా నాన్న చనిపోయాడని మీరు సంబరపడకండి. ఆయన పోయినా ఆయన పుస్తకాలన్నీ అటకమీద భద్రంగా ఉన్నాయి. మీరు నా చెప్పుచేతులలోనే మెలగాలి. కాకపోతే ఏం చేస్తానో మీకే తెలుస్తుంది'. అని అందరిని వెర్రిమాటలతో విసిగిస్తున్నాడు. ఆ ఊరివారందరూ ఏకమై ఒకనాడు ఆ వదరుబోతు ఇంటికి నిప్పుబెట్టారు. ఇంటితోపాటు అకటమీద పుస్తకాలన్నీ కాలి బూడిదైపోయాయి. విద్యలేని ఆ వింత పశువు, నాటినుండి అహంకారం విడచి మర్యాదగా ప్రవర్తించటం నేర్చుకున్నాడు. నోరు, వీపుకు దెబ్బలు తెస్తుంది అన్నది ఇందుకే. బాగా అభ్యసించిన విద్యలు కంఠభూషణములై గౌరవాన్ని

తమపని తాము చేసుకోగలిగిన వారు అదృష్టవంతులు. అవయవములపై పట్టుతప్పి మంచాన పడి, ఇతరులతో సేవచేయించుకొనడం దుఃఖకారణం అవుతుంది. ఇతరులకు, చేయడానికీ కష్టంగానే ఉంటుంది. అందువల్ల ఊపిరి ఉండేంతవరకూ ఉత్సాహవంతులుగా ఉండడానికి యోగమును ఆశ్రయించాలి. సకల రోగ నివారణమైన 'యోగ', రోగ నిరోధకశక్తిని పెంచి శరీరాన్ని దృఢంగా చేస్తుంది.

**ఆస్తికన్న నారోగ్యమే నధిక మన్న**
**సత్య మనుభవమ్మున గాంచు సకల జగతి,**
**కాలు, సేతులు కొఱగాక మూలcబడిన**
**సేవc జేయంగ నెవ్వని చేతనగును?**
**అన్ని సాధనముల కన్న మిన్న యోగ**
**సాధన, బహిరంతరముల శక్తిc బెంచి,**
**ఇంద్రియ జయము నొసcగు, నభీష్టము లిడు**
**యోగమే శరణ్య మఖిలాభ్యుదయములకు!** (యోగవైభవం : 157, 164 పద్యాలు)

సర్వ సమ్మతమైన ఈ యోగ సాధన ఒక మతంవారికి పరిమితంకాదు, అది అందఱిది. ఆశ్రయించిన వారికి ఆరోగ్యాన్నిస్తుంది. యోగం వలన సృజనశక్తి పెంపొందుతుంది. హృదయంలో కవిత్వం ఉప్పొంగుతుంది. గళంలో సంగీతం జాలువారుతుంది. విద్యలు అభివృద్ధి చెందుతాయి. వ్యాపార నిపుణత సిద్ధిస్తుంది. వ్యవసాయంలో ఫలసాయం అధికంగా లభిస్తుంది. వ్యక్తిత్వ వికాసం చేకూరుతుంది. చిత్త వికారం నశించి శాంతి సమకూరుతుంది. ఇంతకూ.... యోగమంటే ఏమిటి?

ఈ ప్రశ్నకు సమాధానంగా పెద్దలు ఏకాగ్రత, చేసే పనియందు శ్రద్ధ అని వివరించారు. యోగసాధకులు ఏ రంగంలో ఉన్నా వారు విజయపరంపరను పొందగలుగుతారు. మనసు, ఇంద్రియములు ఏకంచేసి చేసే ఏ పనియైనా యోగిస్తుంది. లోకంలో ఎవరెవరు సిద్ధపురుషులు మహనీయులున్నారో వారంతా యోగవిద్యా ప్రవీణులే! మహర్షి పతంజలి యోగదర్శనం మనకు అందించాడు. భారతీయుల జీవన విధానమే యోగసంభరితము, మంగళకరం, లోక హితంకరం, ప్రపంచమునకు మార్గదర్శకం.



**శ్లో॥ విద్యా వివాదాయ, ధనం మదాయ**
**శక్తి పరేషాం పరిపీడనాయ!**
**ఖలస్య; సాధోర్విపరీత మేతత్,**
**జ్ఞానాయ, దానాయచ, రక్షణాయ॥**

ప్రకృతిలో పశుపక్ష్యాది జీవులు తాత్కాలికమైన ఆహార, విహారాలను మాత్రమే కోరుకొంటాయి. ఋతుధర్మాన్ని పాటిస్తూ అంతటితో తృప్తిపడతాయి.
మానవులు, తమ మనుగడకు కావాలసిన కూడు, గుడ్డతోబాటు శాశ్వతమైన సంపద, స్థిరనివాసం కొఱకు, అంతులేని అధికారం, అనంతమైన సుఖసంతోషాల కొఱకు పాటుపడతారు. ఆ ప్రయత్నంలో అడ్డుతొలిగించుకోటానికి ఎంతటి క్రూరకర్మలకైనా సిద్ధపడతారు. తమ అపారమైన విజ్ఞానాన్ని కూడ అందుకు వినియోగిస్తారు. తరతరాలకు తరగని ధనాన్ని సాధిస్తారు. ఇతరులను హింసించియైనా తమవారి అభ్యుదయాన్ని కాపాడాలనుకుంటారు.

కాలం 'కల'లాగా కదిలిపోతుంది. శిధిలస్వభావం గల శరీరం, కాలగర్భంలో ఇమిడిపోయి మట్టిపాలౌతుంది. మానవులు, నానాయాతనలుపడి సంపాదించిన సంపదలో చిల్లిగవ్వ కూడ వారి వెంటరాదు. మూటలు కట్టుకొని చాటుగా తీసుకపోవటానికి అవకాశమే లేదు. వారు చేసుకొన్న పాపపుణ్యములు మాత్రము, వారిననుసరించి తగిన ఫలితాలను అనుభవింపచేస్తాయి.

**ధనానిభూమౌ, పశవశ్చకోష్ఠే,। నారీగృహద్వారి, జనాఃస్మశానే॥**
**దేహశ్చితాయాం, పరలోకమార్గే। ధర్మానుగోగచ్ఛతిజీవ ఏకః॥**

పూర్వం, ఈ రోజుల్లో లాగా బ్యాంక్‌లు లేవు కనుక, ప్రజలు, దొంగల బారి నుండి రక్షించుకోటానికి సంపదను భూమిలో పాతిపెట్టుకొనేవారు. ఆ దాచిపెట్టినవారు చెప్పకుండపోయినప్పుడు, అది కాలాంతరంలో లంకెల బిందెలుగా దొరికేవి. ప్రేమగా పెంచుకొన్న పశువులు గొడ్లసావిట్లోనే ఉండి పోతాయి, కట్టుకొన్న(భర్త) భార్య గృహద్వారం వఱకు, బంధుమిత్రులు స్మశానం వఱకు అనుసరిస్తారు. ఎంతో

పోషకవిలువలు గల ఆహారం తిని పెంచుకొన్న అందమైన దేహం ఇక్కడే చితిలో దహింపబడుతుంది. ఇంక జీవునికి పరలోకయాత్రలో వెంటవచ్చేది వారు చేసుకొన్న ధర్మం ఒకటే. అందువల్ల 'ధర్మం చెయ్యండి' అని పెద్దలు హెచ్చరిస్తున్నారు. మంచి సంకల్పం, సత్యమైన మాట, సదచారపరాయణత ధర్మాచరణానికి కారణమవుతాయి.



## "సర్వం ఖల్విదమ్ బ్రహ్మ"

ఈవిశ్వము సర్వము బ్రహ్మమే. అని పై ఉపనిషద్వాక్యమునకు అర్థం. వేదం, పూర్వభాగం కర్మమును గూర్చి, ఉత్తరభాగం బ్రహ్మమును గూర్చి ప్రతిపాదించింది.

కర్మకాండ, మానవులు ఆచరించదగిన యజ్ఞ, యాగాదులను, క్రతు, వ్రతాదులను; నిత్య నైమిత్తికములైన విధి విధానములను బోధిస్తుంది. బ్రహ్మమును గూర్చి వివరించు భాగం జ్ఞానకాండగా ప్రసిద్ధము. అందు ఈ సృష్టికి మూలాధారం విచారించబడినది. అదియే బ్రహ్మము. ఉపాసకులయొక్క సౌకర్యమునకై ఆ బ్రహ్మమునకు రూపకల్పన కూడ చేయబడినది.

బ్రహ్మము, స్త్రీరూపమున సేవించునపుడు 'పరమేశ్వరి' అనియూ, పురుష రూపమున భావించునపుడు పరమేశ్వరుడనియు, పిలవబడుచున్నది. ఆదిమధ్యాంతరహితము, సర్వము తానేఐన ఆ పరమేశ్వరుని తెలుసుకొనుటయే బ్రహ్మవిద్య. ఆ పరమాత్మ, సకలజీవులయందును జీవాత్మగా దర్శనమిచ్చుచున్నాడు.

ఆ పరమాత్మ తత్త్వమును అనుభవమునకు తెచ్చు మార్గమును నిర్దేశించునవి ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత, వీనినే ప్రస్థాన త్రయమని పిలుస్తారు. ఈ మూడింటికీ వ్యాఖ్యానములు రచించిన ఆదిశంకరులు జగద్గురువులుగా ప్రసిద్ధులైనారు.

**ఎవ్వనిచేజనించు? జగమెవ్వనిలోపలనుండు లీనమై**
**ఎవ్వనియందుడిందు, పరమేశ్వరుడెవ్వడు? మూలకారణం**
**బెవ్వ డనాది మధ్యలయుడెవ్వడు? సర్వము దానయైనవా**
**డెవ్వడు? వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేడెదన్!!** **(పోతనభాగవతము)**

పనులు సాగవు. ఆహారాదులు దొరకవు, పస్తులు తప్పవు. రాత్రిపూట పొలాల్లో చీకటిగా ఉంటుంది. వాన వొంగుడు వస్తుంది. పురుగుపుట్రా తిరుగుతూ ఉంటాయి. అందువల్ల పగటిపూట ప్రయత్నించి బయటిపనులు పూర్తి చేసుకోవాలి. అప్పుడు రాత్రిపూట హాయిగా నిద్రించి, విశ్రాంతి తీసుకుని మరునాడు ఆరోగ్యంతో ఉత్సాహంగా పనులలో పాల్గొనవచ్చు. అలసటకు రాత్రి నిద్రయే సరియైన ఔషధం. అది భగవంతుడిచ్చిన వరం.

వృద్ధాప్యంలో వచ్చే ఇక్కట్లను తలుచుకుని, జీవితారంభ వయసులోనే అప్పటికి కావలసిన ఏర్పాట్లను పూర్తి చేసుకోవాలి. అలాంటప్పుడే ముసలితనంలో కాలుమీద కాలు వేసుకుని కూర్చుని తినే అవకాశం వస్తుంది. గుండెలమీద చేయివేసుకుని సుఖంగా నిద్రపోయేందుకు వసతి ఏర్పడుతుంది. లేకపోతే అనాధాశ్రమాలకు తరలిపోవాల్సి వస్తుంది. జీవిత భీమాదులదే సూచిస్తున్నాయి. భద్రత కల్పిస్తున్నాయి. భక్తితో సేవించిన వారికి యోగక్షేమములు కల్పిస్తానని భగవంతుడు మాట ఇచ్చాడు.

84లక్షల జీవరాసుల్లోనూ మానవజన్మ ఉత్తమమైనది. అది లభించి నందుకు భగవత్ చైతన్యానికి కృతజ్ఞతలు తెలియజేస్తూ, నియమబద్ధమైన జీవనం గడుపుతూ మైత్రి, పరోపకారం వంటి ఉత్తమ గుణాలు కలిగి, మరుజన్మ లేకుండా ఉండే ప్రయత్నం చేయాలి. అంటే భక్తులై ముక్తిమార్గంలో పయనించాలి. జీవులు విజ్ఞతతో ఇక్కడ చేసిన శుభ, పుణ్యకర్మలే పరలోకంలో సుఖాన్ని కలుగజేస్తాయి. పాపకర్మలు నరకబాధను తెచ్చిపెడతాయి. నిష్కామ కర్మలు చేస్తూ, భక్తితోకూడి మరుజన్మ లేకుండా చేయమని భగవంతుని శరణువేడి గోవింద నామజపం చేయటం సంసార సాగర తరుణోపాయ మని పెద్దలు చెప్పారు.

**శ్లో॥ వర్షార్థమష్టౌ ప్రయతేత, మాసాన్।**
**నిశార్థమర్థం, దివసే యతేత ॥**
**వార్థక్యహేతో ర్వయసా నవేన ।**
**పరత్రహేతో రిహజన్మనాచ ॥**



అవ్యక్తమైన పరమాత్మ యొక్క వ్యక్తరూపము పంచ భూతములతో కూడిన ఈ చరాచర ప్రపంచము. దీనినే 'ప్రకృతి' యని పిలుస్తారు. ఇది జడము. పరమాత్మ వలన చైతన్యమగుచున్నది. ఈ ప్రకృతి ద్వారా దాని ఆధారమగు పరమాత్మను దర్శింపచేయునవి దర్శనములు. ప్రకృతిలోని ప్రతి అణువునందును పరమాత్మ నిండియున్నాడు.

జీవాత్మ, పరమాత్మల ఐక్యమును ప్రబోధించు ఆ సిద్ధాంతము (అభిప్రాయం) అద్వైతముగా పేర్కొనబడినది. ద్వైతభ్రాంతిని కలిగించు మాయ తొలగినంతనే, సత్యము గోచరిస్తుంది. అప్పుడది సర్వము బ్రహ్మము అను అనుభవమును కలిగిస్తుంది. **"అయమాత్మాబ్రహ్మ" "అహం బ్రహ్మాస్మి"** అను వాక్యములకు ఆ విధంగా సమన్వయం లభిస్తుంది.



# భవిష్యనిధి

ప్రతిమానవుడూ రాబోయే అవసరాలకోసం కొంతధనం దాచిపెట్టు కొంటాడు. అటువంటి చిన్నచిన్న మొత్తాలే ఒకనాటికి పెద్దనిధిగా ఏర్పడతాయి. ధనవిషయమేకాదు, ధర్మంవిషయం అంతే అని పెద్దలుచెప్పారు. ఆక్రమంలో ఏర్పడ్డవే దానధర్మాలు. చేసినధర్మం ఏ కొద్దిదైనా భయాన్ని పోగొట్టి, అధికమైన ప్రయోజనాన్ని ఇస్తుంది. లేనివారిని చూసి దయార్ద్రబుద్ధితో దానం చెయ్యాలని పించడం సజ్జనుల లక్షణం. ఆ దానం కూడా పాత్రతనెతిగి చెయ్యడం విశేషం. చేసింది గొప్పగా భావించి, ప్రకటించి గర్వపడడం అజ్ఞానం, అహంకారం. ఆకలిగొని ఉండటం తినడానికి అర్హత. తానుతిని, ఇతరులకుపంచడం ఔదార్యం. అవసరం గుర్తించి, ఎవరికన్నా ఏదన్నా ఇవ్వాల నిపించడానిక్కూడా కొంత సంస్కారం, పుణ్యఫలం తోడుపడాలి. అప్పుడే మనకు మంచి ఆలోచన కలుగుతుంది. ఇంటికి వచ్చి బిచ్చం అడిగే యాచకులను నిత్యం చూస్తూనే ఉంటాం. వాళ్ళు 'బిచ్చంపెట్టుతల్లీ' అని అడగడంలో విశేషార్థాన్ని బిచ్చగాని మాటల్లో ఇలా వివరించాడో కవీశ్వరుడు.

**ద్వారం, ద్వారమటన్భిక్షుః, శిక్షత్యేవం నయాచతే।**
**అదత్వా, మాదృశోమాఽభూత్, దత్వా త్వం త్వాదృశో భవ॥**

నీకున్నదాంట్లో ఏ కొద్దిగానో ఇచ్చి నీవు నీవుగా ఉండు. ఏమీ ఇవ్వకుండా నాలా లేనివాడివి కావద్దు. ఆ దారిద్ర్యబాధ పాపకర్మలను ప్రోత్సహిస్తుంది. మిక్కిలి దుఃఖానికి కారణమవుతుంది. ఇది ఓ హెచ్చరికగా గమనించాలి.

**అదాన దోషేణ భవేద్దరిద్రః, దరిద్ర దోషేణ కరోతి పాపం।**
**పాపాదవశ్యం, నరకం ప్రయాతి, పునర్దరిద్రో, పునరేవ పాపీ॥**

అదానదోషం వలన దరిద్రుడవుతాడు. దరిద్రదోషంతో పాపానికి ఒడిగడతాడు. పాపం వల్ల నరకానికి చేరుతాడు. పాపఫలంగా నరకదుఃఖాన్ని అనుభవించి తిరిగి భూమిమీద దరిద్రుడుగానే పుడతాడు. పాప కార్యాలకు పూనుకుంటాడు. అని పెద్దలు వివరించారు.



**జగములు, నంతరాత్మయును, సాక్షియు నీవనుచున్ నిజంబుగా**
**నిగమములాడగా, వినియు, నేడితరంబుగ మా కభీప్సితం**
**బగు వరమెట్లు కోరగలమయ్య! భవన్మయమైన పూర్ణ చి**
**ద్గగనములో మమున్ గలిపి క్రమ్మఱపుట్టెడు బాధమాన్పవే**

**(శ్రీకాళహస్తీశ్వర మహాత్మ్యం) – ధూర్జటి కవి**

పామరుడైన 'తిన్నడు' కన్నిచ్చి కన్నప్ప అయినవాడు ఆగమ పండితుడు, పూజారి, ఇరువురు భక్తితో నిత్య పూజలు నిర్వహిస్తూ, ఈశ్వరునికి ప్రీతిపాత్రులయ్యారు. వారికి ఈశ్వరుడు ప్రత్యక్షమై వరం కోరుకోమన్నప్పుడు, వారు పై విధంగా విన్నవించారు. "నదీనాం సాగరో గతిః అన్నట్లు, అందఱూ, చేరవలసిన గమ్యమదే. కోరవలసిన కోరిక అదే.



# ముందుచూపుతో నడవాలి

సైకిల్ వంటి వాహనం మీద ప్రయాణం చేసేటప్పుడు ముందుకుచూస్తూ నడపాలి. లేకపోతే ప్రమాదాలు ఏర్పడే అవకాశం ఎక్కువ. క్రింది చూపు, ప్రక్కచూపు కష్టాలను కొనితెస్తాయి. జీవికి శరీరంకూడా ఒక వాహనం వంటిదే. జాగ్రత్తగా ముందుచూపుతో నడిపితే గమ్యం చేరుకుంటాడు. లేకపోతే అధోగతి పాలవుతాడు. శరీరేంద్రియములకు లోబడి, వ్యసనాలకు బానిసైనవాడు బాగుపడడు. అథోగది పాలవుతాడు.

వర్షాకాలం వస్తుంది. అది నాలుగు మాసాలుంటుంది. అప్పుడు ఆహార సంపాదన మొదలైనవి అధికంగా సాధ్యపడదు. అందుకు తక్కిన 8మాసాలలో కష్టపడి, ఆహారాదులు నిల్వచేసుకోవాలి. అందుకే పెద్దలు **'అన్నీ ఉంటే వర్షాకాలం అంత సుఖం మరెక్కడా లేదు'** అన్నారు. ఆ జ్ఞానం లేనివారు పడేపాట్లు అన్ని ఇన్నికావు.

# జీవులు కోరదగిన కోరిక

పురుషార్థములలో అర్థముతోబాటు కామమును కూడా చేర్చి చెప్పారు. పెద్దలు. ఇక్కడ పురుషుడు అంటే జీవుడని అర్థం. లోక వ్యవహారాలకు పరిమితమైన స్త్రీ పురుషభేదం, పాంచభౌతిక శరీరాలకే గాని, చైతన్య స్వభావంలో భిన్నము కాదు. అందుకు అందరూ అర్హులే.

జీవ యాత్రకు, ధనం, ఇల్లు, స్థలం, పొలం మొదలైన అర్థసంపదలు కావాలి. భార్య, బిడ్డలు, పరివారం మొదలైనవి కామపురుషార్థ ఫలాలుగా పొందాలి. ఈ అర్థకామములు, ధర్మబద్ధములైనప్పుడు మోక్షమునకు హేతువులవుతాయి. మోక్షం, పరమ పురుషార్థం. 'మోక్షం' అంటే జన్మపరంపరలు దాటి, తిరిగి పుట్టవలసిన అవసరం లేకుండుట. అప్పుడు పరిమితమైన జీవచైతన్యం, అపరిమితమైన విశ్వచైతన్యంలో చేరి, ఆనందిస్తుంది. అదియే **పునరావృత్తరహిత శాశ్వత బ్రహ్మపద** మని శాస్త్ర వచనము.

కోరికలు లేని మనస్సు మరలా పుట్టదని అనుభజ్ఞులు అంటారు. వారు బ్రహ్మీ భూతులవుతారన్న మాట. ఈశ్వరునిలో లీనమై, ఈశ్వరులైయుంటారు. ఈశ్వరుని యందు పరిపూర్ణమైన భక్తి కలిగినప్పుడు, జ్ఞానమేర్పడుతుంది. జ్ఞానము, వైరాగ్యమును సమకూరుస్తుంది. వైరాగ్యముతో కూడిన జ్ఞానము కైవల్య (వికారంలేని) ముక్తినిస్తుంది.

ఈశ్వరానుగ్రహం వలననే జీవులకు "ఈశావాస్యమిదంజగత్" ఈజగమంతా ఈశ్వరమయమే. అతడు కానిది లోకంలో ఏదీ లేదనే జ్ఞానం కలుగుతుంది. చిత్తం ప్రశాంతమై, దేహంపై భ్రాంతి తొలగి మనసులో గూడు కట్టుకొన్న (చీకటి) అజ్ఞానము నశించి, విజ్ఞాన దీపం ప్రకాశిస్తుంది. లోకంలో తానింక ఈశ్వరుని కోరదగింది లేదనే సత్యం గోచరిస్తుంది. ఇంకా, దైవాన్ని కోరవలసివస్తే వారు "క్రమ్మఱ పుట్టెడు బాధ మాన్పవే" అని అడుగుతారు. దాన్నే సాయుజ్యం అంటారు. అప్పుడు కోరవలసిదంటూ ఏదీ ఉండదు.



మంచిని ఆశించి స్వచ్ఛందంగా దానాది ధర్మకార్యాలు చేయాలి. చలివేంద్రం పెట్టి ఉచితంగా పదిమందికి నీరందించడం, అన్నసత్రం నిర్వహిస్తూ భోజనవసతి కల్పించడం, ఈ కోవలోకే వస్తాయి. ప్రతిభావంతులగు విద్యార్థులను ప్రోత్సహిస్తే వారు విద్యావంతులై దేశ ప్రగతికి తోడ్పడతారు. విజ్ఞాన దీప్తులను వెలిగిస్తారు. మనంచేసే సహాయ, సహకారాలవల్ల సంతృప్తులైన జీవులు ఆనందిస్తారు, ఆశీర్వదిస్తారు. ఆ పుణ్యఫలం, ఉన్నతికి తప్పక తోడ్పడుతుంది. అందువల్ల భవిష్యనిధికి అందరూ ప్రయత్నించాలి.



# రెండూ ఉండాల్సిందే!

'జ్ఞానం' అంటే ఎఱుక, తెలివిడితనం అని చెబుతారు. ఏదైనా ఒక విషయాన్ని గూర్చి పరిచయం కలిగి ఉండడాన్ని జ్ఞానంగా భావించవచ్చు. అయితే దానికి తోడు 'కర్మ' అంటే, పని చేసినపుడే అది సమగ్రమవుతుంది. వంటను గూర్చి ఎంత తెలిసినా వండడం అనే కర్మ తోడైతేగానీ, వంటకం సిద్ధంకాదు, అనుభవానికి రాదు. అలానే వ్యవసాయం, వ్యాపారం, తక్కిన వృత్తులు, కళలున్నూ.....

వేదాంతశాస్త్రం బ్రహ్మమునుగూర్చి చెబుతుంది. ఎన్ని గ్రంథాలు చదివినా మహానుభావు లెన్నివిధాలుగా, ఎంతగా చెప్పినా అనుభవానికీ, అనుభూతికీ అందనిదే ఆనందం లేదు. పుస్తకంలోని విద్య, మస్తకంలోకి ఎక్కినపుడే ప్రయోజనమేర్పడుతుంది. అందుకు సాధనచేయాలి. దాన్నే 'కర్మ'అని పెద్దలు సూచించారు. సత్కర్మల వలన చిత్తశుద్ధి ఏర్పడుతుంది.

జ్ఞానంలేని కర్మకూడా లక్ష్యమును పొందడానికి, గమ్యాన్ని చేరడానికీ ఉపయోగపడదు. రెండూ ఉండాల్సిందే. ఆకాశంలో ఎగిరే పక్షికి రెండు రెక్కలూ ఉన్నపుడే అది హాయిగా విహరింపగలుగుతుంది. ఆహారాన్ని సంపాదించు కునేందుకు సాధ్యపడుతుంది. అందుకే పెద్దలు ఆ రెండింటి ప్రాధాన్యాన్ని వివరించారు.

**శ్లో॥ జ్ఞానం ప్రధానం, నతుకర్మహీనం,**
**కర్మప్రధానం, నతు బుద్ధిహీనం।**
**తస్మాదుభాభ్యాంతు భవేత్ప్రసిద్ధిః,**
**నహ్యేక పక్షో విహగః ప్రయాతి॥ (పులస్త్య స్మృతి)**

ద్విజులు సంధ్యావందనం చేస్తే బుద్ధి వికసిస్తుంది. సిరి, సంపదలతోపాటు శాంతి, సౌఖ్యాలు లభిస్తాయని తెలుసు. పట్టుమని పదినిమిషాలు భగవచ్చింతన చేయడానికి సమయంలేదని, ఆ పని పక్కకు పెట్టేస్తారు. స్వధర్మం పాటించడానికి వెనుకాడుతున్నారు. ఫలానావాడు ప్రతిరోజూ గంటసేపు జపం చేస్తున్నాడు, దేవతార్చన శ్రద్ధగా చేస్తున్నాడని తెలిస్తే ఎవరేమనుకుంటారోనని బిడియ పడుతున్నారు. చివరకు ముఖాన బొట్టు పెట్టుకోవడానికి కూడా సంశయిస్తున్నారు. పరధర్మం ఎంతగొప్పదైనా భయావహమేనని గీతాచార్యుడు ఎలుగెత్తిచాటిన సత్యం మరచిపోతున్నారు. ఉభయ భ్రష్టులైపోతున్నారు. ఎక్కడికిచేరాలో తెలియకుండా ప్రయాణం చేయడం వృథా! మంత్రాలు పుస్తకంలో ఉంటాయి. జపిస్తేనే అవి ఫలిస్తాయి. గొప్పవారమను కుంటున్నవారు, గొప్పపనులు చేసి చూపిస్తేనే ఆ ఘనత దక్కుతుంది. జ్ఞానం, కర్మ రెండూ సమప్రాధాన్యం కలిగినచోట కార్యసిద్ధి, కీర్తి, ధనం, సౌఖ్యం లభిస్తాయి. పరులకు చెప్పే విషయాలు(జ్ఞానం) ఆచరిస్తేనే గౌరవం లభిస్తుంది. గొప్పదనం నిలుస్తుంది.





**శ్లో॥ సర్వే క్షయాంతా, నిచయాః, పతనాంతాః, సముచ్ఛ్రయాః।**
**సంయోగా, విప్రయోగాంతాః, మరణాంతంచ జీవితమ్॥**
**(అయోధ్యాకాండ, 105-16 శ్లో॥)**

కూడబెట్టిన వివిధ సంపదలు నశిస్తాయి, ఉన్నతములైనవి అన్నీ పతనమవుతాయి. పుత్రకళత్రాది లౌకిక బంధాలు తెగిపోతాయి. కూడినవారు విడిపోతారు. ఎంత ఉన్నతంగా జీవించినవారైనా చివరకు మరణిస్తారు. అందువల్ల దేనియందు వ్యామోహం పెంచుకోవద్దని పెద్దలు హెచ్చరిస్తారు.

ఈప్రకృతిధర్మాన్ని మహాత్ములైనవారినోట చెప్పించినపుడు మానవులు దానిని స్మరించుకొని. గుండెనిబ్బరాన్ని పొందగలుతారని ఋషి ఆకాంక్ష. కష్టంవచ్చినప్పుడు శాస్త్రం గుర్తుకురాదు. పెద్దలు చెప్పిన మాటలే గుర్తుకువస్తాయి. అందుకు ఉపకరించేవే **సుభాషిత రత్నభాండాగారము** లోని సుమధుర సూక్తులు. సంస్కృత భాష సూక్తినిధి. సకల ధర్మశాస్త్రములకు అది నిలయం. వేదం దానికి మూలం.



# మరణంతో ముగిసేది జీవితం

జనన, మరణాలమధ్య నడిచేది జీవితం. పుట్టుకతో ప్రారంభమైన జీవితం, మరణంతో ముగుస్తుంది. "నిందలేనిదే బొందిపోదు" అనే సామెత ప్రకారం, మరణానికి ఏదో కారణం చెప్పుకోవడం వింటూంటాం. కొందరు వారి పుణ్యఫలాన్ననుసరించి అనాయాసంగా కూడా మరణించడం చూస్తూంటాం. ఎంతటివారికైనా మరణం తప్పదు. ధనవంతులు, అధికారులు, బలవంతులు, దృఢకాయులు, స్త్రీలు, పురుషులు అయిన మానవులే కాదు, పశు, పక్ష్యాదులైన ప్రాణులన్నింటికీ మరణం సంభవిస్తుంది. వింత ఏమిటంటే, పోయిన వాడిని గూర్చి మిగిలినవారు, బ్రతికి ఉన్నవారు బాధ పడుతుంటారు. ఈ బాధపడేవారు ఒకనాటికి చనిపోవక తప్పదు. ఈ బహిరంగ రహస్యం అందరికీ తెలిసిందే! ఐనా, జీవులందరికీ ఎవరు ఎలా పోయినా తాము మాత్రం శాశ్వతంగా ఉండిపోతామనే భ్రమ ఉంటుంది. మరణించినవారిని చూసినపుడు తాత్కాలికంగా వైరాగ్యమేర్పడినా స్మశానం విడిచి బయటకురాగానే రాగద్వేషాలు వెంటాడుతూనే ఉంటాయి. ఇది అనివార్యమైన లోకప్రవృత్తి. దీనినే స్మశాన వైరాగ్యం అంటారు.

రామాయణంలో పితృ, సత్యవాక్య పరిపాలనకై రాముడు అడవులకు వెళ్ళిన తరువాత దశరథుడు రామ వియోగాన్ని భరించలేక 'హా!రామా!' అని విలపిస్తూ మరణించాడు. భరత, శత్రుఘ్నులు పితృకర్మలాచరించి రాముని అయోధ్యకు తీసుకురావడానికి చిత్రకూటానికి సపరివారంగా వెళ్ళారు. తండ్రి మరణవార్తను విని దుఃఖించిన రాముడు, లక్ష్మణునితోగూడి మందాకినిలో తిలాంజలులిచ్చి, రేగుపండుతో గూడిన గారపిండితో పితృదేవతలకు పిండ ప్రదానం చేస్తాడు. లోకంలో తాముతినే ఆహారమే దేవతలకు నివేదించడం పరిపాటి.

తండ్రి మరణానికి దుఃఖిస్తున్న సోదరులకు ప్రాజ్ఞుడైన రాముడు లోకప్రవృత్తిని గుర్తుచేసి, ఓదారుస్తాడు.



# గురువులు

**గురవో బహవః సన్తి శిష్య విత్తాపహారకః**

**దుర్లభోఽయం సమర్థోహి శిష్య హృత్తాపహారకః**

**"గురువు"** అంటే అజ్ఞానాన్ని తొలగించేవాడని అర్థం. తనను ఆశ్రయించిన శిష్యుల సందేహాలను, హృదయావేదనలను రూపుమాపి జ్ఞానబోధ చేయగల సమర్థుడని భావము. ఈ లోకంలో ప్రస్తుతం అందరూ గురువు అనే పిలవబడుతున్నారు. ఆ గురు శబ్దానికి విలువ లేకుండా చేస్తున్నారు వారు. డాక్టర్లు రోగులను పీడించినట్లు ఈ గురువులు, శిష్యులను వేధిస్తున్నారు. ఏనాడూ వారికి జ్ఞానాన్ని ప్రసాదించకుండా తమచుట్టూ తిప్పుకుంటూ శిష్యులధనాన్ని కాజేసే గురువులే అధికంగా కనపడు తున్నారు. అట్టి వారిని గమనించి వారికి దూరంగా ఉండటం మేలు.

నిజమైన గురువులు అవ్యాజకరుణామూర్తులై శరణార్థులైన వారికి సందేహ నివృత్తి చేసి, వారి ఆత్మోన్నత్యానికి తోడుపడే వారుగా ఉంటారు. వారికి తన-మన భేదం ఉండదు. వారు జాతి గర్వించదగిన వారుగా ఉంటారు. సమదృష్టి వారి వద్ద చూసి మనం నేర్చుకోవాలి. అట్టి గురుపరంపరకు మన భరతభూమి పుట్టినిల్లు. మన ప్రాంతంలో చందోలు శాస్త్రిగారుగా విఖ్యాతులైన **"బ్ర॥వే॥ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి"**గారు అటువంటి మహానుభావులు. పరమహంస పరివ్రాజకాచార్యుల ప్రశంశలకు, ఆదరానికి ప్రాతులైనారు.

తే॥గీ॥ **ఎందఱెందఱు గురువులీ యిలను లేరు,**
**శిష్యవిత్తాపహరులై చెఱచువారు**
**ఆర్య గృహ్యుఁడాచార్యుఁడయ్య తఁడొకండె**
**శిష్యహృత్తాప హారియై చెలఁగువాడు.** (వ్యాసకర్త)



# సారస్వతోపాసన

చదువుల తల్లి సరస్వతి. ఆమె వివిధ రూపాలే కళలు. అందులో సంగీతం, నృత్యం, శిల్పం, చిత్రం, కవిత్వం మొదలైనవి లలిత కళలు. ఆ ఐదింటిలో విశిష్టమైనది కవిత్వం. అది జీవితం యొక్క సమగ్ర స్వరూపాన్ని ఆవిష్కరించగల సాధనం. శాశ్వతం. దాన్నే **'సారస్వత'**మంటారు. సరస్వతి యొక్క అక్షర రూపమని అర్థం.

క్షతిలేని ఆ అక్షరం, జ్ఞానానికిగుర్తు. ఆ శబ్దజ్యోతి లేకపోతే లోకాలలో చీకట్లు బాగా అలముకుంటాయి. ఆ అక్షర దీపానికి ప్రమిద, వత్తి, నూనె అక్కఱలేదు. దివ్యమై, అవ్యయమైన ఆ సారస్వతాన్ని ఉపాసించేవారికి మోహమనే చీకటి తొలగిపోతుంది. అందువల్ల ఆ విధమైన జ్ఞానసరస్వతిని ఆరాధించి అమృతత్వాన్ని పొందుదామని తత్వ దర్శనులైన పెద్దలు ఉపదేశించారు.

**తద్దివ్య, మవ్యయంధామ, సారస్వత, ముపాస్మహే।**
**యత్ర్పసాదాత్ర్పలీయన్తే, మోహాంధ తమసచ్ఛటాః॥**

దేహం శాశ్వతం కాదని, భౌతిక సంపదలేవీ వెంటరావని, తెలిసికూడా మాయలోపడి; నేను, నాది అనే అహంకార-మమకారములతోపాటు, నావారు, పరాయివారనే భేద దృష్టికిలోనై, ప్రకృతివిరుద్ధంగా ప్రవర్తించి వికృతులకు లోనుకావటం జరుగుతోంది.

ధర్మ విదూరులై, విద్వేషాన్ని రెచ్చగొట్టే రచనల వల్ల హింసాప్రవృత్తి అధికమౌతుంది. మన ఋషులు ఈ విషయమై పరిశోధనచేసి, భౌతికమైన బంధంతోబాటు, పారమార్థిక సంబంధాన్ని కనుగొని, అందుకు కావలసిన ధర్మార్థకామమోక్షములనే 4 పురుషార్థాలను సాధించమని ఆదేశించారు.

జీవి జనన, మరణముల పరిధిదాటి, పునరావృత్తిరహిత శాశ్వత బ్రహ్మపదం చేరి ఆనందించుటకు తగినట్లు ప్రయత్నించమని ప్రోత్సహించారు. ఆ జ్ఞాన, విజ్ఞానసంపద శ్రుతి, స్మృతులతోపాటు పురాణేతిహాసాలలో; కావ్య, నాటకాలలో ప్రబోధించారు.



**నోరు మంచిదైతే ఊరు మంచిదౌతుంది** అన్నది ఇందులో సారాంశం. నోరే **రసభరితమైన నుడువులకెల్లన్ ఆధారము** అని సుమతులకు తెలియజెప్పాడు బద్దెన సుమతీశతకంలో. రాజై కవిత చెప్పిన మహనీయుడు రాజకవి, కవిరాజు.

నోరు తెఱిచి మాట్లాడినపుడే మానవుల వ్యక్తిత్వం బయటపడుతుంది. ఆ మాటయే లోకంలో మన్ననకు కారణమౌతుంది. **విభూషణమ్ మౌన మపండితానామ్!** అనువుకానిచోట అధికులమని గర్వింపక మౌనంవహించడం మేలు. పరోపకారమైన మాట చెప్పి పుణ్యం సంపాదించుకోవచ్చు. పురుషోక్తులాడితే ప్రమాదమే కాదు, ప్రాణహాని కూడా సంభవించవచ్చు. **బాలాదపి సుభాషితమ్!** శాస్త్రసమ్మతమైన, సమయానికి తగినమాట బాలుడు చెప్పినా పాటించాలి. బ్రహ్మ అంతటివాడైనా పనికిమాలిన చెడుమాటలు చెప్పిననాడు గడ్డిపరకలా విడిచిపెట్టాలి. చెడువినకండని ఇందులో సందేశం.

**శ్లో॥ యుక్తి యుక్త ముపాదేయం, వచనమ్ బాలకాదపి।**
**అన్యత్ తృణమివత్యాజ్యం అప్యుక్త్యం పద్మయోనీనా॥**

(యోగ వాసిష్టము)

ఉద్వేగాన్ని కలిగించు ధోరణిగల మాటలను విడిచి సత్యం, ప్రియం అగు మాటలాడుట వాచిక తపస్సుగా గీతాచార్యుడు చెప్పాడు. **"వాఙ్మయం తపఉచ్యతే"** వాక్పారుష్యము, మహాదారుణమది, విషముకంటె, దహనము కంటెన్- (మహాభారతం).

కొద్దిగా చేసి, కొండంత చేసినట్లు గొప్పలు చెప్పుకోవడం, ఇతరులలోని మంచిని కూడా చెడుగా విమర్శించడం, రెండూ పనికిరావు. అవి ఆత్మోత్కర్ష, పరనిందగా పరిగణింపబడతాయి. మృదువుగా, ప్రియంగా, ధైర్యంగా, హితకరంగా, సత్యాన్ని పలకడం వల్ల మన్నన కలుగుతుంది. ఆ ప్రయత్నం చేయండని పెద్దలు సూచించారు.

**శ్లో॥ సత్యం, మృదు, ప్రియం, ధీరోవాక్యం, హితకరం వదేత్।**
**ఆత్మోత్కర్షం తథా నిందాం పరేషాం, పరివర్జయేత్॥**

క్షణ క్షణం విద్యను, కణకణం ధనమును, సంపాదించాలి. కాల యాపనతో వృధా చేసుకొంటే పరిపూర్ణత సిద్ధించదు. జరిగిపోయిన కాలం తిరిగిరాదు. తొంబది తొమ్మిది పైసలు రూపాయి కాలేవు. ఏ ఒక్కటో కొద్దిగా నేర్చినవాడు సర్వజ్ఞుడు కాలేడు. ప్రయత్నమే కార్య సిద్ధికి మూలం.



## మాట – మన్నన

పోరు నష్టము, పొందు లాభము అని పెద్దలు చేప్పారు. చిన్నతనంలో చూచి వ్రాయుమని ఒజ్జబంతి ఏర్పరచేవారు. ఒజ్జ అంటే గురువు. గురువులు, పేజీలలో పైన వ్రాసిఇచ్చే దానిని చూచి విద్యార్థులు తక్కిన పంక్తులలో వ్రాసేవారు. అలా వ్రాయడం వలన చేవ్రాలు కుదిరేది. దోషరహితంగా వ్రాయగలిగేవారు. దిద్దిన ఆ విషయం మనసులో స్థిరపడి జీవితంలో చక్కని నడవడి అలవడటానికి ఉపయోగపడేది. సత్యమునే పలుకవలెను, ధర్మమునే అచరించవలెను మొదలగునవి ఇట్టివే. మంచిమాట (వింటే) అంటే జీవులన్నీ సంతోషిస్తాయి. పశు, పక్ష్యాదుల విషయం కూడా అంతే. పెంపుడు జంతువుల సంగతి చూస్తూనే ఉన్నాంకదా! ప్రియమైన వాక్యం చెబితే జీవులెంతో సంతోషాన్ని అనుభవిస్తాయి. ఆ ఆనందం ఇతరులకు అందిస్తారు. అందువలన మంచిమాటే మాట్లాడమని ప్రబోధించారు. మనసునొప్పించే చెడ్డమాటలు అనకండనే అర్థం అందులో సూచించారు. ఇంక మంచి మాటలు అనడానికి వెనుకాడవద్దనే ప్రేరణ ఉంది.

**శ్లో॥ ప్రియవాక్య ప్రదానేన, సర్వే తుష్యన్తి జంతవః।**
**తస్మా తద్దేవ వక్తవ్యం, వచనే, కా దరిద్రతా?॥**

(భర్తృహరి)



ఒకరాజు తన అధికారం, ధనం, బలం, బలగం, యవ్వనం చూసుకొని విఱ్ఱవీగుతూ మంచిమాట వినడానికి కూడా యిష్టపడని స్థితిలో ఆలోచించి, శ్రేయోభిలాషులైన పెద్దలు **ప్రబోధ చంద్రోదయం** అనే నాటకాన్ని సృష్టించి, అతనికిష్టమైన వినోద సాధనం **నాటక ప్రదర్శన** ద్వారా అతనికి జ్ఞానోదయం జరిగే విధంగా ప్రయత్నించారు. సరస్వతి ప్రసన్నమైతే అజ్ఞానం నశిస్తుంది. సారస్వతం సిద్ధిస్తుంది.

*****

## ప్రియము – హితము

**శ్లో॥ సులభా పురషా రాజన్! సతతం ప్రియవాదినః!**
**అప్రియస్యచ పథ్యస్య వక్తాశ్రోతాచ దుర్లభః !!**

లోకంలో కొందరు ఏదో ప్రయోజనాన్ని ఆశించి, ఎదుటివారిని **"ఇంద్రుడివి, చంద్రుడివి"** అని పొగడ్తలలో ముంచి తేలుస్తారు. ఇటువంటివారు ఎక్కడైనా, ఎప్పుడైనా తారసపడుతూ ఉంటారు. అది విన్నవారు నిజమేనని భ్రమపడి, గర్వపడితే తాము చేరేది అధఃపాతాళానికే, అంతక నిలయానికే (నరకం). వినేందుకు కొంత కటువుగా ఉన్నా, మేలు చేకూర్చే మాట చెప్పేవారు అరుదు. తాను చెప్పినది విని ఎవరేమనుకుంటారో అనే మొహమాటం అడ్డువస్తుంది కొందరికి. ఒకప్పుడు ఎక్కడైనా ఒకరు ఆ మొహమాటం విడిచి యథార్థాన్ని చెప్పడానికి ముందుకు వచ్చినా, అది వినేందుకు అందరూ ఇష్టపడరు. ఆ పని చేయడానికి సిద్ధంగా ఉండరు. పైపెచ్చు "నీ ఉచిత సలహాలు మాకు వద్దు. నీ ఊకదంపుడు ఉపన్యాసం ఇక ఆపు. నీ పని ఏమిటో నీవు చూసుకో" అని విరుచుకు పడతారు. విరోధులుగా భావించి, కక్ష పెంచుకుంటారు. స్నేహాన్ని, బంధుత్వాన్ని, పెద్దరికాన్ని లెక్కచేయక, తృణీకరిస్తారు. **వేట, జూదం, మద్యపానం, అబద్ధాలాడటం, మొదలైన వ్యసనాలు మంచి అలవాట్లు**

**కాదు.** మానుకోమని చెబితే వారికి కోపం వస్తుంది. దుర్వ్యసనాలు వ్యక్తిగతంగా హానికలిగిస్తాయి. సమాజాన్ని కూడా బాధపెడతాయి. అందువల్ల సజ్జను లెవ్వరు ఆ జోలికి పోరాదు అనేది పెద్దల మాట. అదే ఉన్నతికి పూలబాట, గమ్యానికి రాచబాట.

శ్రీమద్రామాయణంలో రావణుడు తప్పుడు నడవడి కలిగిన శూర్పణఖ చెప్పుడు మాటలు విని, రాముని భార్య సీతనపహరించడానికి వచ్చి, మాయలమారి మారీచుని సాయపడమని కోరాడు. మారీచుడు, **రాముని గుణగణాలు** వివరించి రామునిపై రావణునికి గల దురభిప్రాయం మార్చుకోమని **"రాముడు రూపుదాల్చిన ధర్మమని, సత్యపరాక్రముడని వర్ణించి, దేవతలకు ఇంద్రునివలె, లోకంలో జనులందరికి రాజు రాముడే"** అని అనేక విధముల నిరూపించి, రావణుని సీతాపహరణోద్యమం నుండి విరమించుకోమని నయానా, భయానా చెప్పాడు.

**శ్రీరామో విగ్రహవాన్ ధర్మః, రామ స్సత్య పరాక్రమః!**
**రాజా సర్వస్య లోకస్య వసూనాం వాసవో రివః !!** అని

అయినా అతడు వినలేదు. తుదకు సపరివారంగా రావణుడు రాముని చేతిలో మరణించాడు. అసలు 'వ్యసనము" అంటే కష్టాన్ని తెచ్చి పెట్టె అలవాటు. అది మానుకోమని చెప్పారు మహర్షులు. అదివిని, పాటించడం మానవులుగా మనందరి కర్తవ్యం. అప్పుడే ఋషి, ఋణం, తీరుతుంది.

## ఋషివాక్కు

"కృషి ఉంటే, మనుషులు ఋషులౌతారని" పెద్దలు చెప్పారు. ఏరంగంలో అయినా, అధ్యయనము, అభ్యాసము ఉన్నతిని సిద్ధింప జేస్తాయి. వారి మాటలు, ప్రమాణములై అనుసరణీయములవుతాయి.





## విద్యాధన సముపార్జన

విద్ ధాతువు నుండి పుట్టిన విద్య తెలియదగినదని అర్థం. విద్యవలనే సమస్త విజ్ఞానము ఏర్పడుతుంది. విద్యను ధనముతో పోల్చి **'విద్యాధనం, సర్వధన ప్రధానమ్'** అని దాని గొప్పతనమును నిరూపించారు. లోకంలో ఇప్పుడు చలామణీ అవుతున్న (కరెన్సీ) డబ్బు ఒక్కటే ధనం కాదని, ధనమనేక విధాలుగా ఉంటుందని వేదం చెప్పింది. **'ధన మగ్నిః, ధనం వాయుః ధన మింద్రో బృహస్పతిః'** అని శ్రీ సూక్తం వివరించింది.

అగ్ని వెలుగుకు, వేడికి మూలం. ఎముకలు కొరిగే చలితో బాధపడే వారికి మంచులో కూరుకుపోయిన వారికి, చీకటిలో ఉన్నవారికి వాని విలువ తెలుస్తుంది. ఏది లేని వారికి అది కలగటం, ధనలాభంగా పెద్దలు సూచించారు. గాలిలేక ఊపిరాడక బాధపడే వారికి, ఉక్కపోతతో సతమతమయ్యే వారికి నిర్మలమైన చల్లనిగాలి లభించడం సౌఖ్యాన్ని కలిగిస్తుంది. ప్రాణశక్తిని ప్రసాదిస్తుంది. ఈ విధంగా ప్రకృతి భగవంతుడిచ్చిన వరంగా భావించటం వివేకవంతుల లక్షణం. ఇట్టి అవగాహనయే విద్యకు పరమార్థం. **విద్యకు సాటిధనంబు లేదిలన్** అంటాడు (భర్తృహరి). ఏనుగుల లక్ష్మణ కవి. విద్య ధనాన్ని పుట్టించే సాధనంగా వర్ణించారన్నమాట.

అట్టి విద్యను పెన్నిధిగా భావించి, అది జ్ఞాతులు వంచించి తీసుకోవడానికి వీలులేనిదని, దొంగలు అపహరింపజాలరని, విద్యను ఏ విధంగా, ఎందరికి పంచి పెట్టినా, తరిగిపోనిదని వివరించారు. అంతకన్నా గొప్పధనం లేదని చెప్పారు.

**శ్లో॥ జ్ఞాతిభిః వంచతే నైవ, చోరేణాపి నసీయతే ।**
**దానేన నక్షయం యాతి, విద్యారత్నం మహాధనమ్॥**

ఆ విద్యాధనములను సంపాదించటంలో అలసత్వం (బద్ధకం) పనికిరాదని కూడా పెద్దలు హెచ్చరించారు.

**శ్లో॥ క్షణశః కణశశ్చైవ విద్యామర్థంచ సాధయేత్।**
**క్షణ త్యాగేకుతోవిద్యా, కణత్యాగేకుతో ధనమ్॥**

ధర్మాన్ని బోధించింది వేదం. ఆ వేదం, భగవంతుని ప్రసాదం. **యస్య నిశ్శ్వసితంవేదః** అని బోధించారు. ఆ విధి, విధానములను పాటించినప్పుడే జీవితం హాయిగా నడుస్తుంది. పట్టాలు తప్పితే ప్రమాదాలు సంభవిస్తాయి. బ్రతుకు రైలుబండి ప్రక్కకు పడిపోతుంది. **బ్ర.వే. తాడేపల్లి వేంకటప్పయ్య శాస్త్రిగారు (చందోలు)** తమ **శ్రీరామకథాఽమృత** గ్రంథరచనకు దైవమే ప్రేరణనిచ్చిందని చెప్తూ, ఈ విధంగా ప్రకటించారు. వారికారచన, శాశ్వతమైన కీర్తి ప్రతిష్టలను సంపాదించి పెట్టింది. పరమేశ్వరానుగ్రహానికి పాత్రులను చేసింది.

తే॥గీ॥ **పశులఁ గాచెదు వారల పగిదిఁగఱ్ఱ**
**వట్టిపాలింపబోరు దేవతలు; ప్రీతి**
**నెపు, డెవనిఁ, బ్రోవనెమ్మది నెంతురతని**
**కసదుగాని తెలివిఁ గూర్తురనుటెటింగి** **(బా.కా.-పీఠిక)**





# కళ్ళు తెఱవండి

**అనేక సంశయోచ్ఛేది, పరోక్షార్థస్య దర్శనం।**
**సర్వస్య లోచనం శాస్త్రం, యస్యనాస్త్యంధ ఏవసః॥**

సృష్టిలో అన్నీ, ఒక నియమానికి కట్టుబడి నడవడం మనం గమనిస్తాం. లేనినాడు జీవనగతి సరిగా సాగదు. సూర్య, చంద్రుల యొక్క, తక్కిన గ్రహాలయొక్క గమనాన్నిబట్టి లోకంలో జరిగే మార్పులు అందరికీ అనుభవంలో ఉన్నవే, ఆ నియమాన్నే శాస్త్రం అన్నారు. ఇల్లు కట్టాలన్నా, పేరు పెట్టాలన్నా, భూమి దున్నాలన్నా, పైరు వేయాలన్నా ప్రతీదీ నియమబద్ధంగా జరగాల్సిందే. శాసించేది శాస్త్రం అన్నారు. ఆ నియమావళిని బోధించేది అని అర్థం.

కాళిదాస మహాకవి తన రఘువంశంలో జ్ఞానవిజ్ఞానాలను తెలియజేసే శాస్త్రాన్ని నేత్రాలతో పోల్చాడు. లోకంలో అన్నీ అందరికీ తెలియవు. ఈశ్వరుడొక్కడే సర్వజ్ఞుడు. ఆయా ప్రకృతిధర్మాలు పరిశీలించి, పరిశోధించి కొన్ని అనుభవాలను ఆవిష్కరించారు మహర్షులు. అవే శాస్త్రాలుగా ప్రసిద్ధికెక్కి ఎన్నో అద్భుతాలను వివరించాయి.

**తస్మాత్ శాస్త్రం ప్రమాణంతే కార్యాకార్య వ్యవస్థితే।**

ఏదిచేయాలో, ఏదిచేయకూడదో చెప్పేది శాస్త్రమని జగద్గురువు గీతాచార్యుడు ఉపదేశించాడు. అలా కానప్పుడు సుఖ, శాంతులు లభింపవని హెచ్చరించాడు. వాస్తు పద్ధతులు, వైద్యవిద్య, జ్యోతిర్విజ్ఞానం, భూగోళ, ఖగోళ రహస్యాలు మొదలైనవన్నీ శాస్త్రాలే. వ్యాపారమైనా, వ్యవసాయమైనా ఆశాస్త్రాన్ని అనుసరించినపుడే సఫలమౌతుంది. లేకపోతే దుఃఖం సంభవిస్తుంది.

అందువల్ల అనేక సందేహాలను పోగొట్టేది, తెలియనిదానిని స్పష్టంగా తెలియచేసేది, లోకానికే కన్నువంటిది అయిన శాస్త్రాన్ని అనుసరించడం మన కర్తవ్యం, గ్రుడ్డిగా ప్రవర్తించక కళ్లు తెఱవండని వివరించిన పెద్దలమాట పాటిద్దాం. చర్మ చక్షువులతోపాటు, శాస్త్రచక్షువులు ఉండాలి. లేకపోతే విజ్ఞానరంగంలో కళ్ళులేని కబోదులుగా మిగిలిపోతాము.

# సాంఘిక జీవనం

లోకంలో ఏ జీవీ ఒంటరిగా జీవించడం సాధ్యంకాదు. అందునా మానవులకు ఇతరుల సహాయ సహకారాలు ఉండితీరాల్సిందే! అల్పజీవియైన చీమదగ్గర ఈ సాంఘిక జీవనాన్ని మానవులు నేర్చుకోవాలి. అవి, తమకు దొరికిన ఆహారం వగైరా అన్నింటినీ పిలిచి, పంచుకొని తినడం చూస్తుంటాం. తక్కిన పశు, పక్షులుకూడా కొన్ని ఈ పద్ధతిని పాటించడం గమనిస్తాం. అవి సుఖ, దుఃఖాలు కలసి అనుభవిస్తాయి. ఒక పక్షి ప్రమాదంవల్ల మరణిస్తే చూసి ఊరుకోవు. అఱచి, అఱచి తక్కినవాటిని పిలచి, తమ సానుభూతి ప్రకటిస్తాయి. ఇంకా ఎగరడం చేతగాని పక్షిపిల్ల, గూటినుండి బయటపడితే దాన్ని రక్షించటానికి యథాశక్తి ప్రయత్నాలు సాగిస్తాయి. ఎవరైనా అడ్డొస్తే ఎదిరించి పోరాడతాయి.

భాగవతంలో గజేంద్రుడు మొసలిచే పట్టుపడ్డప్పుడు, తక్కిన ఏనుగులు ఒడ్డున నిలిచి బాధపడ్డాయని, విడిచి పోవడానికి ఇష్టపడలేదని వర్ణించాడు పోతన. కొన్ని పెంపుడు ప్రాణులు తమ యజమానికి కలిగిన సుఖ, దుఃఖాలలో పాలుపంచుకోవడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. యజమాని రక్షణలో ప్రాణాలు విడవడానికి కూడా అవి వెనుకాడవు. విశ్వాసానికి మారుపేరుగా వాటిని (గుఱ్ఱం, కుక్క మొ॥వి) వర్ణించడం అనుభవసిద్ధమే!

మానవుడు స్వార్థం కారణంగా సంఘజీవనానికి దూరంగా ఉంటాడు. ఇతరులను దరి చేరనివ్వడు. తనకు ఉపకారం చేసినవాడనే విషయంకూడా మరచిపోయి అతి కఠినంగా వ్యవహరిస్తాడు. వింతగా ప్రవర్తిస్తాడు. అదీ మానవులలోని ప్రత్యేకత! కానీ, పెద్దలు మాత్రం 'ఎవడు జీవించడం వలన పదిమంది జీవిస్తారో వాని జీవితం జీవితమని వివరించారు. అందుకై ప్రయత్నించమని ప్రోత్సహించారు. ఈ సందర్భంగా పరిశ్రమలు స్థాపించి ఇతరులుకు జీవనోపాధి కల్పించినవారు, వ్యవసాయంచేసి పండిన పంటను ఇతరులకు అందుబాటులోకి తెచ్చే రైతులను ప్రశంసించితీరాలి. అందరికోసం శ్రమించి దేశరక్షణ కల్పించే భద్రతాదళ సిబ్బందిని కొనియాడాలి, చేయెత్తి జై కొట్టాలి.



# దైవమే మనకు తెలివినిస్తుంది

లోకంలో **'వాడు బాగా తెలివైనవాడు'** అని అనడం వింటాం. ఆ తెలివి దైవప్రేరణ వలన కలుగుతుంది. దానితో సత్కర్మములను ఆచరించి, సుఖం, ధనం, కీర్తి ప్రతిష్ఠలతో బాటు దైవానుగ్రహాన్ని పొందటం జరుగుతుంది.

'దుఃఖం' అనుభవించ వలసి ఉన్నప్పుడు, దుష్కర్మలను చేసే ప్రేరణ కలుగుతుంది. జీవులు ఆ ఫలితాన్నీ అనుభవించి తీరవలసిందే. ఈ సుకృత, దుష్కృతాలు పూర్వజన్మ కర్మఫలాలే. జనన మరణాత్మకమైన ఈ సంసారం అనాది. సుఖపడాలని అందఱూ కోరుకొంటారు. అందుకు తగిన దైవానుగ్రహాన్ని పొందే సత్కర్మాచరణ మాత్రం చేయరు. మన సంకల్ప, వికల్పముల వెనుక ప్రేరణ ఉంటుంది. అదే దైవం. ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తులు దైవ స్వరూపములే. దైవాన్ని ఆశ్రయిస్తే అన్నీ లభిస్తాయి.

**శ్లో॥ న దేవా, దణ్డమాదాయ, రక్షన్తి పశుపాలవత్।**
**యంహి రక్షితు మిచ్ఛన్తి బుద్ధ్యా సంయోజయన్తి॥**

మనం చేసేపనులు కలిసిరావాలంటే, దైవానుగ్రహం ఉండితీరాలి. ఒకడు తనకున్న ధనంతో పొలాన్నో, స్థలాన్నో కొంటే అది కోటిరూపాయలు అవుతుంది. ఇంకొకడు అదే డబ్బును రెండింతలు చెయ్యాలనే అత్యాశతో జూదం వంటి వ్యసనములపాలుచేస్తాడు. (షేర్స్)ధనం కోల్పోయి, బాకీలుతీర్చటం కోసం, ఉన్న ఆస్థిని అమ్మి కట్టవలసి వస్తుంది. ఎవరి అదృష్టం వారిది. **ఆ అదృష్టమే దైవం.** అదృష్టం అంటే కనబడనిదని అర్థం. అదే దైవమని చెప్పబడుతుంది.

ఆ భగవంతుని కృపను సంపాదించాలంటే ఆయన విధించిన ధర్మాన్ని పాటించాలి. ఆ ధర్మమే మనకు కవచమై రక్షణనిస్తుంది. అధర్మం శిక్షిస్తుంది. దైవాన్ని కన్నుకప్పి, తప్పించుకోవటం సాధ్యంకాదు. ముందుగా మన మనస్సే అందుకు సాక్షి. సూర్య,చంద్రులు, దిక్కులు, గ్రహములు, నక్షత్రములు దైవం ఏర్పఱచిన ప్రత్యక్ష సాక్షులు (సీసీ కెమెరాలు).

చేస్తూ ఉంటాం. ఆ తప్పొప్పులకు ఫలితం తప్పదు. అవి జన్మపరంపరకు కారణాలు ఔతాయి. ఇది చాలా సూక్ష్మమైన విషయం. సునిశితంగా ఆలోచించాలి. మన ఋషులు ఈ విషయంలో బాగా పరిశోధనలు చేసి, ఆ సత్యాన్ని ప్రకటించారు. అందుకోలేక పోవటం, ఆచరించకపోవటం, మన అలసత్వాన్ని తెలియజేస్తుంది. ప్రపంచంలో ఇతరులు భౌతిక విజయాన్ని సాధించినా, ఈ ఆత్మసత్యాన్ని గుర్తించలేదు. మరణానంతర సుఖాన్ని గురించి వారు ఆలోచించలేదు.

ప్రకృతిలో ప్రతిచెట్టు ఒక ఔషధగుణం కలిగి ఉంటుంది. అది ఎందుకు ఉపయోగపడుతుందని తెలియజేసేది శాస్త్రం. అదే ఆయుర్వేదం. మెఱుగు కాగితాలలో బిళ్ళలకు, సూది మందులకు అలవాటుపడిన మనకు అవి అంతగా నచ్చవు. ప్రకృతిని అనుసరించకపోవటమే అన్ని అనర్థాలకు మూలం. రోగ కారణాలను గుర్తించి వైద్యం చేయకుండా తాత్కాలికమైన ఉపశమనాలకు ఇష్టపడతాం. అందువలన ప్రకృతికి దూరంగా జరిగిపోతున్నాం. కల్తీని, కాలుష్యాన్ని కొని తెచ్చుకొంటున్నాం. తెలిసినా మంచి చేయలేని దురదృష్టం మనలను వెంటాడుతోంది. ఆయుర్వేదమైనా, వేదాంతమైనా, మనం పాటించటం కష్టమనిపిస్తోంది. అందుకే మన పెద్దలు, స్థిరమైన వాటిని విడిచి, అస్థిరములను ఆశ్రయిస్తే, అస్థిరములైనవి నశించడం ఖాయం. స్థిరములకు ఎటూ దూర మవుతున్నాం కనుక, రెంటికి చెడిన రేవడుల మవుతున్నామని హెచ్చరించారు.

**యోధృవాణి పరిత్యజ్య, అధృవంచ నిషేవతే।**
**ధృవాణి తస్యనశ్యంతి, అధృవం నష్టమేవహి॥**

అయితే ఇతరులకు చెప్పటంలో అందరం పండితులమే. ఆచరించే వారు మాత్రం, ఏకొందరో, వారే మహాత్ములు. దీనినే వివేకానంద 'అనుష్ఠాన వేదాంతం' అన్నారు.

**పరోపదేశ పాండిత్యం, సర్వేషాం సుకరం నృణాం।**
**ధర్మే స్వయమనుష్ఠానం, కస్యచిత్తుమహాత్మనామ్॥**





**శ్లో॥ యస్మిన్ జీవతి జీవంతి, బహవస్సతు జీవతు ।**
**కాకోఽపి కిం నకురుతే, చంచ్వా స్వోదర పూరణం ॥**

**(విక్రమార్క చరిత్రమ్)**

**"నా చిన్ని బొజ్జకు శ్రీరామరక్ష"** అనుకుంటూ 'తనూ, తన ఇల్లు తనవారు మాత్రమే బాగుంటే చాలు' అని భావించేవారే ఎక్కువగా ఉన్న ఈ సమాజంలో సాంఘికజీవనం యొక్క ప్రాధాన్యాన్ని తెలియచేసేది పైవాక్యం. అక్కడక్కడా ముక్కుతో ఒక్కొక్క గింజా ఏఱుకొని కడుపునింపుకునే కాకికి, వీరికీ తేడా ఏమిటని ప్రశ్నిస్తున్నాడు కవి. మనమందరమూ అందఱి సుఖం కొఱకు ప్రయత్నించాలన్నది పెద్దలు చెప్పిన సాంఘిక జీవనంలోని పరమార్థం.



# గాయత్రీ మంత్రము

**నాఽన్నోదకం సమందానం, నద్వాదశ్యాః పరం వ్రతం।**

**నగాయత్ర్యాః పరం మంత్రం, న మాతుః పరదైవతం॥**

జీవులకు ప్రాణాధారములైనవి అన్నము, నీరు. అనుభవంలో అవి తృప్తినిస్తాయి. తక్కినవి (వెండి, బంగారం మొ॥) అలంకారాలు. ప్రాణం నిలబడిన తరువాత మిగిలిన (గో,భూ,ధనం) హంగులు. అందువల్ల అన్నదానం, జలదానం ముఖ్యమైనవని పెద్దలు చెప్పారు. సత్రాలు, చలివేంద్రాలు పెట్టి సద్ధర్మమాచరించి చూపించారు.

ప్రతి మాసంలో రెండు ఏకాదశి తిధులు వస్తాయి. ఆ ఏకాదశినాడు ఉపవాసముండి జపతపాదులతో నామ పారాయణలతో భగవంతుని స్మరించడం, మరునాడు ద్వాదశి ఘడియలలో అతిధి-అభ్యాగతులతో భోజనం చేయడం సంప్రదాయం. దీనినే ద్వాదశి పారణ అంటారు. అంబరీషుడు ఈ ద్వాదశి వ్రతాన్ని ఆచరించి భగవంతుని అనుగ్రహానికి పాత్రుడయ్యాడని భాగవతంలో చెప్పబడింది. అందరూ తప్పక ఆచరించవలసిన వ్రతం ఇది.

జన్మనిచ్చిన తల్లిదండ్రులు ప్రత్యక్ష దైవాలు. అందులోనూ ప్రథమస్థానం తల్లిదే. వేదం కూడా మాతృదేవోభవ అని ముందుగా తల్లినే ప్రస్తావించింది. ఉపనయనంలో వటువునకు తల్లిదే ప్రథమభిక్ష. అమ్మ పదంలోని కమ్మదనాన్ని గూర్చి కవులెందరో కీర్తించారు. ఆమెకు సేవచేయడంకంటే వేరే ధర్మంలేదు. ఆ జీవిత పరమార్థాన్ని గుర్తించినవారు సుకృతులు, ధన్యులు.

**"మననాత్త్రాయతి ఇతి మంత్రః"** మననం చేయడం వలన రక్షించేది మంత్రం అని విజ్ఞులు వివరించారు. సప్తకోటి మహా మంత్రములలో సాటిలేని మేటి మంత్రం గాయత్రీ మంత్రం. వేదమాతగా స్తుతింపబడింది. అందువల్ల సకల దేవతా స్వరూపమైన గాయత్రీ ఉపాసన ద్విజులకు పరమ కర్తవ్యం. సమస్త వరాలనిచ్చునది, బుద్ధి శక్తులను వికసింపజేయునది గాయత్రి. ఏ ఇతర దేవతా మంత్రములను అనుష్ఠించే వారికి కూడా ముందుగా సంధ్యావందనం, గాయత్రి, విధిగా చేయవలసిన నియమం ఉంది. చేసుకున్నవారికి చేసుకున్నంత ఫలితం లభిస్తుంది. ఉపనయన సంస్కారం వలన ద్విజులౌతారు. వేద శాస్త్రాధ్యయనములకు అర్హులౌతారు.



**శ్లో॥ క్షణేతుష్టా, క్షణేరుష్టా, అతుష్టాశ్చ క్షణేక్షణే।**

**అవ్యవస్థిత చిత్తానాం, ప్రాసాదోఽపి భయం కరః॥**

ఉదాహరణకు ఒక వ్యక్తిని, వారొక పెద్దగెల అరటిపండ్లు తినాలని ఒక్కసారిగా కిలోనెయ్యి త్రాగాలని, మానెడు బియ్యపన్నం భుజించాలని, బిందెడునీళ్ళు గడగడ త్రాగాలని బ్రతిమిలాడి, భంగపడతారు, వత్తిడి చేస్తారు. బెదిరిస్తారు. వారిమాట పాటించకపోతే శాపనార్థాలు పెడతారు. కొరడా దెబ్బలు కొట్టిస్తారు. కొఱత వేసినంత పనిచేస్తారు. అందువల్ల మనస్సు నిలకడలేని వారితో కలిసి ఉండటం అసాధ్యమని తెలుసుకొని దూరంగా ఉండటం మంచిది.



# మాటలకు చేతలకు ఎంతోదూరం

"వేదాంతం గురించి చెప్పనివాడు, వైద్యం గురించి తెలియని వాడు లోకంలో లేడని" అంటారు. అంటే అవి అంత సులభమన్న మాట. ఐతే చెప్పటానికెంత తేలికో అవి చేయటం అంతకష్టం.

భారతదేశం కర్మభూమి, ధర్మభూమి. అందువల్ల మన పెద్దవారు కర్మాచరణం ద్వారా, ధర్మాన్ని సంపాదించుకొని క్రమక్రమంగా జన్మరాహిత్యానికి ప్రయత్నించండని ప్రబోధించారు. మనుగడ సాగించే మట్టి మహిమ చేతనో, త్రాగేనీరు, తినేతిండి, పీల్చేగాలి, అనుభవించే చలి, వెలుగులవలనో ఏమో ఇక్కడివారికి కొంత జ్ఞానం పుట్టుకతోనే ఏర్పడుతుంది. అట్టివారు 'శరీరం నిత్యంకాదు. సంపదలకు నిలకడలేదు. జీవికి చావుతప్పదు. అందువల్ల చేతనైన ధర్మాన్ని త్వరగా, సరిగా చేయండి.'అని ఉపదేశించారు.

జీవితం శాశ్వతం కాదని తెలిసినా, స్థిరంగా ఉంటామనే భ్రాంతితో, ఎన్నోపనులు చేస్తూ కాలాన్ని వ్యర్థంచేస్తూ ఉంటాం. ఆ ప్రయత్నంలో ధర్మాన్ని పాటించటం కష్టమనిపిస్తుంది. తెలిసిన సత్యాన్ని అనుభంలోకి తెచ్చుకోలేక, తప్పులు

## అవ్యవస్థిత చిత్తము

వ్యవస్థ అంటే ప్రణాళికా బద్ధమైన జీవనపద్ధతి. అది క్రమాన్నను సరించినప్పుడు అసాధ్యాన్ని కూడా సుసాధ్యం చేయగల సామర్థ్యం సిద్ధిస్తుంది. కానీ మనసెప్పుడూ స్థిరంగా ఉండక పరిపరివిధాల ఆలోచిస్తుంది. ఎప్పుడూ నిశ్చలంగా ఉండటం దానికి చేతకాదు. నిర్మలమైన మనసే మనిషి మనుగడను సూచిస్తుంది. మాన్యతను కల్పిస్తుంది.

కొందఱు లోకమంతా అవునన్నదాన్ని తాము కాదంటారు. అందఱూ కాదన్నదాన్ని ఔనంటారు. "ఎద్దెమంటే తెడ్డమంటార"ని వీరిని గూర్చే చెప్పారు. ఈ విషయంలో "ఊరంతా ఒకత్రోవైతే, ఉలిపికట్టె దొకత్రోవ" అన్నది లోకంలో ప్రసిద్ధమైన సామెత.

సాంఘిక మర్యాదననుసరించి లోకంలో కొందఱు ఇష్టంలేకపోయినా మౌనంగా అంగీకరిస్తారు. నలుగురిని అనుసరిస్తారు. వీరిని లౌకికులంటారు. లౌక్యం తెలిసినవారని అర్థం. కొందఱు కుండబద్దలు కొట్టినట్లు ఉన్నమాట ముఖాన అనేస్తారు. ఎవరేమనుకొన్నా లెక్కచేయరు. ఇంకొందఱు పైకి ప్రేమనటిస్తూ లోపల ద్వేషిస్తారు. "నోరు పలకరిస్తుంది. నొసలు వెక్కిరిస్తాయి" అనేది వీరి ప్రవర్తనకు అక్షరరూపం. ఇంకొందఱు తమపబ్బం గడుపుకొనేంత వఱకు ఎదుటి వారిని ఇంద్రుడు చంద్రుడని పొగుడుతారు. మీ అంతవారులేరని పైకెత్తేస్తారు. ఆ తర్వాత అధఃపాతాళానికి త్రోసేస్తారు. అది వారి సంస్కారానికి గుర్తు. కొందరేమో కోపంవస్తే బడబడ తిట్టేస్తారు. అనురాగమేర్పడితే ఆదరిస్తారు. అందలమెక్కిస్తారు. ఇది లోకంపోకడ.

ఏ నియము లేక, అవ్యవస్థితమైన చిత్తం (మనస్సు) కలవారికి ఏదొచ్చినా పట్టుకోవటం తట్టుకోవడం కష్టమవుతుంది. వారు ఒకప్పుడు అనుగ్రహం చూపించినా భరించటం కష్టమే. క్షణంలో కోపం, క్షణంలో సంతోషం. మరుసటి క్షణంలో అసంతృప్తి, అసహనం వారిని ఆవహిస్తాయి. వారితో సహజీవనం కష్టం, సౌఖ్యమన్నది అసాధ్యమవుతుంది.



అందని పండ్లకు అఱ్ఱులుచాచడం కంటే, అందరికీ అందుబాటులో ఉన్న గాయత్రీ మహామంత్రాన్ని అనుష్ఠించి, ద్విజులు భగవంతుడిచ్చిన వరాన్ని కాపాడుకోవాలి. ద్విజ శబ్దంలో గల గౌరవాన్ని నిలబెట్టుకోవాలి. ఐహిక ఆముష్మిక సకల సంపదలు ఇచ్చేది గాయత్రి. సంధ్యావందనంలో శ్రియమావాహయామి, బలమావాహయామి.......... అని కోరడంలో తాత్పర్యమిదే.



## విధి బలీయము

ప్రపంచంలో ప్రాణకోటిలో ఎన్నో వింతలు, విడ్డూరాలు. బలం కలవి, తెలివి కలవి, కదిలేవి-కదలనివి (చరాచరములు), ఇలాంటివన్నీ విధికిలోబడి ఉండవలసినవే! దానిని ఆత్మ విచారణతో పరిశీలించి, పరిశోధించే వారికి అది అనుభవానికి వస్తుంది. ఈ విధంగా ఆలోచించిన పెద్దలు, ఆ విధిచేతిలో మనం కీలుబొమ్మలమే కానీ స్వతంత్రులం కామని తెలుసుకుని, ఆ సత్యాన్నే ప్రకటించారు. విధి అంటే దైవం అని వివరించారు.

ప్రకృతిలో స్వేచ్ఛగా సంచరించే ఏనుగులు, పాములు, పక్షులు మొదలైనవి పట్టుబడడం, లోకానికి వెలుగును ప్రసాదించే సూర్య, చంద్రులు గ్రహపీడ (గ్రహణాల)ను అనుభవించడం, బుద్ధి శక్తి కలవారు (పండితులు) దరిద్రులుగా ఉండడం విచిత్రం కదా అంటాడు భర్తృహరి తన నీతిశతకంలో.

**గజ, భుజంగ, విహంగమ బంధనం।**
**శశి దివాకరయోర్గ్రహ పీడనమ్।**
**మతిమతాంచ విలోక్య దరిద్రతాం।**
**విధి, రహో, బలవా నితిమేమతిః॥**

ఆ విధియే, పరమైశ్వర్యాన్నిస్తుంది, దారుణమైన కష్టాలను కలిగిస్తుంది. లాభాలాభాలు, జయాపజయాలు, సుఖదుఃఖాలు, అన్నీ విధి నిర్ణయాలే!

విధిని తప్పించుకోవడం ఎంతటివారికైనా సాధ్యంకాదని వాల్మీకి "విధిర్నూన మసంహార్యః" అని వివరించాడు. లంకలో అశోక వనంలో సీతనుచూసి జనకుని కుమార్తె, దశరథుని కోడలు, శ్రీరాముని ధర్మపత్ని ఐన సీతకు ఇంతటి కష్టం సంభవించింది కదా! అని హనుమంతుడు బాధపడ్డాడు.

ఎవరైనా, మేము ఇంతటివారము, అంతటివారము అని విర్రవీగడం తగదు. నిరాశా, నిస్పృహలతో కృంగి, కృశించి నశించిపోవడం ఉచితంకాదు. ఏదైనాచెయ్యాలనే ఆలోచన, చేసిన దానికి ఫలితము ప్రారబ్ధముననుసరించి విధియే ప్రసాదిస్తుంది. అందనిదానికి అఱ్ఱులుచాచడం వృధాశ్రమ. ప్రయత్నం చేసినా ఫలితం రానప్పుడైనా, ఈ సత్యాన్ని గ్రహించాలి. అనుకున్నదాని కన్నా ఎక్కువ లభించినపుడూ తాను నిమిత్తమాత్రుడనని అర్థం చేసుకోవడం బుద్ధిమంతుల లక్షణం. మంచి, చెడులకు విధిప్రేరణమే కారణం. **"బుద్ధిః కర్మానుసారిణీ"** అని పెద్దలంటారు. జీవులకు, మంచి సమయంలో మంచిబుద్ధి, చెడు సమయంలో చెడుబుద్ధి పుడుతుంది. ఆ, యా ఫలితములననుభవింప జేస్తుంది.





# పుణ్యం రెండింతలు పొందండి

సమాజానికి ఉపయోగపడే ఏదైనా ఒక మంచిపనిచేస్తే పుణ్యం వస్తుందని, అక్షయలోకాలు సిద్ధిస్తాయని పెద్దలుచెబుతారు. ఆవిధంగానే పెద్దలైనవారు ధర్మాన్ని ఆచరించి ఆదర్శంగా నిలిచారు. ఊరి కుపకరించే చెఱువులు తవ్వించడం, అన్నసత్రాలు పెట్టించడం, దేవాలయాలు నిర్మించడం, బడులు కట్టించడం, ఆరామప్రతిష్ట (వన మహోత్సవం) చేయించడం, మొదలైనవి ఆకోవకు చెందినవే. వాటి నిర్వహణకు కొంత భూమికానీ, ధనంకానీ యివ్వడం జరుగుతుంది. కాలక్రమేణా ఆ భూమి, ధనం అన్యాక్రాంతమై ఇచ్చినవారి ఉద్దేశం నెఱవేరని సందర్భాలు కోకొల్లలు. దేవాదాయ, ధర్మాదాయశాఖ ఏర్పడిన తర్వాత ఆయాసంస్థల నిర్వహణ మరీ అధ్వాన్నమై, వచ్చే ఆదాయం ఆ సిబ్బంది జీత, బత్తేలకే చాలటంలేదు. దాతలిచ్చిన స్థలాలు, పొలాలు ఆక్రమణకు గురౌతున్నాయి. అడిగేందుకు ప్రజాస్వామ్యం అడ్డొస్తుంది. రాజులు పోయి, రాజ్యాలుమారినా అలా దానం ఇచ్చిన భూములు ఇతరులు ఆక్రమించకుండా ఉండాలని దాతలు భావించారు. దాన శాసనాలు ఆవిషయాన్ని నిరూపిస్తున్నాయి.

హరిశ్చంద్రుడు తన రాజ్యాన్ని విశ్వామిత్ర మునికి ధారపోస్తూ దేవ, బ్రాహ్మణ మాన్యములు(వారికి ఉదారంగా ఇచ్చినవి) తప్ప, తక్కినవి మాత్రమే అని చెప్పి ఇచ్చాడు. ధర్మరాజాదులు ఆ పద్ధతిని పాటించారు, ధర్మపరిపాలన సాగించారు. ఇప్పుడు వాటికి ముప్పువచ్చింది. ఈ సందర్భంలో పెద్దలు శాసనాల్లో ప్రస్తావించిన ఒక్క విషయం గుర్తు చేసుకోవడం ఎంతైనా అవసరం.

**తాముచేసే దాన, ధర్మాలకంటే ఇతురులు చేసినవాటిని కాపాడడం రెండింతలు పుణ్యఫలాన్ని యిస్తుంది. పరులిచ్చినదాన్ని అపహరించడం, అమ్ముకొని సొమ్ముచేసుకొని నాశనం చేయడం, దురాక్రమణకు పాల్పడడం జరిగితే తాము స్వయంగా చేసిన దానధర్మాలు కూడా ఫలించవు** అని వివరించారు. పూర్వు లిచ్చినదాన్ని కాపాడడం తామిచ్చిన దానికంటే అధికమని, అనంత పుణ్య ఫలదమని కూడా సూచించారు.

**శ్లో॥ స్వదత్తా ద్విగుణం పుణ్యం, పరదత్తానుపాలనమ్।**
**పరదత్తాపహారేణ, స్వదత్తం నిష్ఫలంభవేత్ ॥**

అందుకు నిదర్శనం. ప్రతి సంవత్సరం ఇంటింటా మనం జరుపుకునే దీపావళి నరకాసుర సంహారానికి చిహ్నంగా చెప్పుకుంటాం.

విజయదశమి అమ్మవారు చేసిన దుష్ట సంహారానికి, ధర్మవిజయానికి ప్రతీకగా జరుపుకుంటాం. సర్వశక్తి స్వరూపిణి, జగన్మాత అయిన లలితా పరమేశ్వరి, శుంభ-నిశుంభులను, చండ-ముండులను, నాశనం చేసింది. రక్తబీజుడు, తన ప్రతి రక్తపు బిందువునుండి ఒక రాక్షసుని సృష్టించేస్తుంటే కాళియై అతని రక్తాన్ని పూర్తిగా హరించి, అతనిని నిర్మూలించింది. చెడు ఎంత తొందరగా అభివృద్ధి చెందుతుందో చెప్పేది రక్తబీజుని వృత్తాంతం. దుర్గయై మహిషుడనే అసురుని నిగ్రహించింది. దుర్గముడనే రాక్షసుని చంపి ఆమె "దుర్గ"గా కీర్తింపబడింది.

దుష్టుల బాధ సహించలేక ఆనాడు భగవంతుడు అవతరించి ధర్మరక్షణ చేయాలని మహాత్ములు, మహర్షులు, మునులు అనేక విధముల తపస్సు చేశారు. పరమేశ్వరానుగ్రహం పొందారు. ధర్మాచరణ చేయగలిగారు.

దురాచారం వలన మనం ఈనాడు చాలాకష్టములు పడుతున్నాం. అయినా భగవత్‌శక్తిని గూర్చి ప్రార్థించటం లేదు. సంధ్యావందనం, గాయత్రీజపం మొదలైన మంత్రానుష్టానములు ఆచరించటం వలన ఆధ్యాత్మిక బలం, ఆత్మవిశ్వాసం, బుద్ధి వికాసం సిద్ధిస్తాయి. ధర్మవిజయానికి అవి దోహదంచేస్తాయి. కాన సర్వులూ జాగరూకులై భగవంతుని శరణువేడాలి. ధర్మాన్ని అనుష్టించాలి. ధర్మాన్ని మనం రక్షిస్తే. ధర్మం మనల్ని రక్షిస్తుంది. "ధర్మో రక్షతి రక్షితః" మన వలన ఇతరులకు కష్టం కలుగనీయక, సత్ప్రవర్తన కలిగి ఉండటం మన కర్తవ్యం.





# ధర్మమును అవమానించరాదు

భరతభూమి ధర్మభూమి, కర్మభూమి. విశాలమైన ఈ భారతదేశంలో ఎన్నో మతసిద్ధాంతాలు ఉన్నా, అన్నింటి సందేశం ఒక్కటే. అదే **సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ.** "బ్రహ్మమొక్కటే.. పరబ్రహ్మమొక్కటే". అంటూ చాటింది మన సాహిత్యం (అన్నమయ్య). సత్యం ఎన్నటికీ సత్యమే! దాన్ని జ్ఞానంచేత తెలుసుకోవాలి. మనమిప్పుడు జ్ఞానహీనులమై సత్యాన్ని గుర్తించలేకపోతున్నాం. చాలాకాలం బానిసలుగా బ్రతికిన ఈ జాతికి ఆ బ్రహ్మజ్ఞానం కనుమరుగై పోయింది. ఆ మాటలు చెవికెక్కడం లేదు, మనసుకు పట్టడం లేదు.

పాశ్చాత్యుల జీవనశైలికలవాటుపడి, వారి మాయమాటలు విని, స్వధర్మాన్ని విడిచిపెడుతున్నాం. విపరీత ప్రతిభాషలతో విమర్శిస్తున్నాం. ఏముంది ఇందులో అని పెద్దలను నిలదీస్తున్నాం. కొంటెతనంతో దారుణంగా నోటికొచ్చినట్లు నిందిస్తున్నాం. ధర్మంపట్ల అభిరుచికలిగి, స్వానుభవంతో ఆనందిచేవారికిది ఐహిక, ఆముష్మిక అభ్యుదయాన్ని కలిగిస్తోంది. ఆత్మానుభూతిని అందిస్తోంది. జ్ఞానదృష్టితో చూచినపుడు బ్రహ్మమయమైనదిగా ఈ జగత్తు దర్శనమిస్తుంది. **"దృష్టిం జ్ఞానమయం కృత్వా, పశ్యేత్ బ్రహ్మమయంజగత్।"** అన్నది పెద్దల సూచన. దీనినిబట్టి మనచూపులోనే లోపముందని తెలుస్తుంది.

**అతి పరిచయాదవజ్ఞా, సంతతగమనా, దనాదరో భవతి।**
**మలయేభిల్ల పురంధ్రీ, చందన తరుకాష్ఠ మింధనంకురుతే॥**

**(పండితరాజశతకం)**

సహజంగా లోకంలో అతి పరిచయం వలన అవమానమేర్పడుతుంది. మాటిమాటికీ వచ్చిపోయేవారి విషయంలో అనాదరణ చోటుచేసుకుంటుంది. మలయపర్వతంలో ఉండే ఆటవిక స్త్రీ(భిల్లపురంధ్రి) చందనవృక్షం యొక్క కట్టెలను విరిచి పొయ్యిలో పెట్టి వంటచేస్తుంది. ఆమెకది ఇంధనంగానే గోచరిస్తుంది.

దేశంలో అందరికీ ఎంతో విలువైన మంచిగంధం కట్టెలు అక్కడివారికి అతి సామాన్యంగా కనబడతాయి. అవసరానికి ఆ విధంగా ఉపయోగపడతాయి. నీతినియమాలు పాటింపచేస్తూ, ఆత్మతత్వాన్ని బోధించి, యోగవిద్యనభ్యసింపచేసే మన భారతీయులు మన ఆధ్యాత్మిక విద్యలన్నింటినీ ప్రక్కనపెట్టి, ఇతరులను అనుకరించే ప్రయత్నంలో సంస్క ృతీ సంప్రదాయాలను విస్మరిస్తున్నారు. సుసంస్కారానికి దూరమౌతున్నారు! ధర్మాన్ని అనుసరిస్తే గొప్ప నాగరికత కలవారమవుతాం. లేకుంటే ఆటవికులుగా మారిపోతాం! రామాయణంలో విభీషణ చరిత్ర మిందుకు నిదర్శనం.

**ధర్మ ఏవహతోహన్తి, ధర్మోరక్షతి రక్షితః** (వాల్మీకిరామాయణం)

మన సంస్కృతి మనకు చాదస్తంగా అనిపిస్తుంది. దానిని పాటించేవారు పిచ్చివారుగా కనిపిస్తున్నారు. పాలుత్రాగి, రొమ్ముగుద్దిన దుష్టులవలే ఇక్కడపుట్టి, ఇక్కడ పెఱిగి, అభివృద్ధి సాధించి, ఇక్కడి సంస్కృతిని, సదాచార సంపత్తిని ద్వేషిస్తున్నారు. తమ పతనానికి తామే గొయ్యి తవ్వుకుంటున్నారు. ఇతరులకు ఆమోదయోగ్యము, ఆచరణసాధ్యము అయిన ఈ ధర్మము మనచే ద్వేషింప బడడానికి కారణము? మనకు దానియందు భక్తి, శ్రద్ధలు లేకపోవటమే.





చేయటంలోనే వినియోగిస్తారు. అటువంటివారు శాశ్వతంగా స్మరింప బడతారు. తక్కినవారు కాలగర్భంలో కలసిపోతారు. కొందఱు పనిగడుపు కొనేందుకు ఇచ్చకములు చెప్తారు. ఆ తర్వాత తల ఎగరేస్తారు. అది వారి దుర్జన లక్షణం. కొందరికి ఇవి ఏవీ పట్టవు. ఉపేక్షాభావంతో ప్రవర్తిస్తారు.

విద్యలో, వివేకంలో, వృత్తిలో, ప్రవృత్తిలో ఈ భేదం కనబడుతుంది. ఇది 'సృష్టి స్వభావం' కదా అని తెలుసుకోవటం విచక్షణ వలన సాధ్యపడుతుంది. వివేకానికది గీటురాయిగా నిలుస్తుంది.



## పాపాత్ములు నశిస్తే లోకములు సంతోషిస్తాయి

లోకకంటకులు, ధర్మవిరోధులు అయినవారు తమ భౌతికశక్తి, అధికార బలములతో విజృంభించి అధర్మాచరణం చేస్తూ సాధులను, సచ్చరిత్రులను బాధిస్తూ ఉంటారు. అట్టివారిని సంహరించడానికి భగవంతుడు అవతరించి ధర్మసంస్థాపనం చేస్తాడు. దుష్టులు నశించటం వలన లోకులు నిర్బంధముల నుండి బయటపడి తమ ధర్మాన్ని తాము పాటించ గలుగుతారు. భగవత్ కృపకు పాత్రులు కాగలుగుతారు.

**"అభినందన్తి భూతాని వినాశే పాపకర్మణి"** అని వాల్మీకి రామాయణంలో వివరించారు. త్రేతాయుగంలో రావణుడు అతడి అనుయాయులు; ద్వాపర యుగంలో కంసుడు, నరకాసురుడు, జరాసంధుడు మొదలైనవారు ధర్మానికి విరుద్ధంగా ప్రవర్తించి, భగవంతుని చేతిలో శిక్షార్హులైనారు. కలియుగంలో అట్టివారి సంఖ్య పెరిగిపోయింది. పాపం పండిననాడు, వా రాఫలితం అనుభవిస్తారు. ఆ మంచిరోజుకోసం లోకం, సమాజం ఎదురుచూస్తూంటుంది. సమయమొచ్చినపుడు పండుగ చేసుకుంటుంది. పీడవిరగడైందని ఆనందిస్తుంది.

పురాణయుగంలో జరిగిన ధర్మవిజయానికి ఇప్పటికీ మనం సంతోషాన్ని ప్రకటిస్తాం. ఉత్తరప్రదేశ్‌లో రామలీలా మైదాన్ అనేచోట జరిగే ఉత్సవ సంరంబం

# వివేకానికేది గీటురాయి

కనబడటానికి మనుష్యులందరూ ఒకటిగా ఉన్నా, లోకంలో ఎవరి స్వభావం వారిది. ఎవరి సామర్థ్యం వారిది. బరువులు మోస్తున్నాయని గుఱ్ఱాన్ని గాడిదను ఒకటిగా పరిగణింపరాదు. అలాగే కాకి, కోకిలా చూడటానికి నల్లగా ఉండి, ఒకే రూపంగా కనపడినా, వసంత ఋతువు వచ్చినప్పుడు, కోకిల మధురంగా గానం చేస్తుంది. జనంచేత ఆదరింపబడుతుంది. ఆరాధింప బడుతుంది. దానికి ఆ భగవంతుడిచ్చిన వరం, ఆ స్వరం – కంఠంలో అంతటి మాధుర్యం లభించటానికి, కోకిల ఏ పుణ్యం చేసుకుందో అంటాడు కరుణశ్రీ.

**శ్లో॥ కాకః కృష్ణః, పికః కృష్ణః కోభేదః పికకాకయోః।**
**వసంతకాలే సంప్రాప్తే, కాకః కాకః, పికః పికః ॥**

**'పురుషులందు పుణ్యపురుషులు వేరయా'** అన్నాడు వేమన. **'మానవు లంతా ఒకటి కాదా?'** అని వాదిస్తారు కొందఱు. స్వరూపంలో సమానమే, కాని స్వభావంలోనే తేడా. అందుకే పెద్దలు **'పుఱ్ఱెకోబుద్ధి, జిహ్వాకోరుచి'** అన్నారు. ఆయా జీవుల సంస్కారాన్నిబట్టి, స్వభావం ఉంటుంది. సమయం, సందర్భం వచ్చినప్పుడు బయటపడుతుంది. మంచి, చెడులు వారి ప్రవర్తనవలన గుర్తింపబడతాయి. ప్రపంచ చరిత్రలే అందుకు సాక్ష్యం.

ఒక ఇంట్లో వ్యక్తులలోనే, అభిరుచులలో, ఆచరణలో భేదం ఉండటం గమనిస్తాం. ఒకే కూర తెచ్చినా వండేటప్పుడు, ఇగురుగా, వేపుడుగా, పప్పుగా, పులుసుగా ఉండాలని కోరుకొంటూ తమతమ ఆసక్తి చూపిస్తారు. ఇది సహజం. సమన్వయంతో ముందుకు సాగటమే సమరసభావం అనిపించుకుంటుంది. అప్పుడే స్వారస్యం ఏర్పడుతుంది. అదే సాంఘిక బాధ్యత.

సమాజంయెడ బాధ్యత పడటంలో కూడా వ్యక్తుల స్వభావంలో తేడాలుంటాయి. కొందఱు స్వార్థపరులు, అవకాశాన్ని తమ ప్రయోజనాలకు అనుకూలంగా మలచుకుంటారు. ఇతరులు తమ సర్వస్వాన్నీ పరులకు సేవ



# ఆరాధన

దానము, భోగము 'ధనానికి' ముఖ్యప్రయోజనాలు, అవి, లేకపోతే ధనం దొంగలపాలో, దొరలపాలో అవుతుంది. పరులకు ఇచ్చినా, తాననుభవించినా ధనం తరిగిపోతుంది. మూర్ఖుడైనవాడు దారిద్ర్యం వస్తుందేమో అన్న సందేహంతో ఎన్నడూ, ఎవ్వరికీ ఇవ్వటానికి ఇష్టపడడు. మెతుకుపోతే బ్రతుకుపోతుందని భావించే అతడు, బీదవానికి బిచ్చం కూడా పెట్టడానికి ఇష్టపడడు. లోకవ్యవహారం బాగా తెలిసిన ప్రాజ్ఞుడు ఇక్కడ ఏదీ శాశ్వతంకాదని, తనకెంత ఉన్నా తుదకు ఏదీ తనవెంటరాదనీ గుర్తించి, మరుజన్మలో దారిద్ర్యం రాకుండా ఉండేందుకు వితరణశీలుడై దానధర్మాలు చేస్తాడు.

**శో॥ మూర్ఖో నహిదదాత్యర్థం, నరో దారిద్ర్యశంకయా ।**
**ప్రాజ్ఞస్తు వితరత్యర్థం, నరో దారిద్ర్యశంకయా ॥**

పూర్వజన్మలో జీవిచేసుకొన్న కర్మఫలాన్ని అనుభవించడానికే ఈ జన్మ వస్తుంది. పుణ్య, పాపఫలములే సుఖ, దుఃఖాలుగా సంప్రాప్తిస్తాయి. అందుకే జీవితంలో శుభాశుభములైన కొన్ని సంఘటనలు అనిమిత్తంగా జరుగుతాయి. అందుకు కారణాలు మనం ఊహించలేం, పరిహరించనూలేం. ఈనాడు మనం నాలుగు వేళ్ళూ లోపలికి పోయేవిధంగా కడుపునిండా అన్నం తింటున్నామంటే అందుకు కారణం క్రిందటి జన్మలో ఎవరికో ఇంత పెట్టుకొని ఉన్నామని అర్థం. లభించకపోతే పెట్టలేదన్నది నిజం. ఒకప్పుడు పదార్థం ఉన్నా తినే అవకాశం దొరకదు. విధి అంత బలీయమైనదని గ్రహించాలి. **"పెట్టినందుకు పుట్టుటే సాక్షి"** అని ఈ విషయాన్ని పెద్దలు చాలా చమత్కారంగా చెప్పారు. **తానుతిన్నది గోతిపాలు, ఇతరులకిచ్చింది (పెట్టింది) తనపాలు** అని అనుభవజ్ఞులు చెప్పడంలో తాత్పర్యం ఇదేకావచ్చు. ఆ ఇచ్చేది(దానం) కూడా శ్రద్ధగా ఇవ్వాలి. తన స్థాయికి తగ్గకుండా దానం చెయ్యాలి.

ఒకప్పుడు ఒక బీద కుటుంబీకుడు, తన పెరట్లో పండిన ఆకు, కూర, కాయ, పండు ఆదరంగా ఇతరులకు పంచిపెట్టేవాడు. శారీరక కష్టానికి ప్రతిఫలంగా ధనం తీసుకోవడానికి ఇష్టపడేవాడు కాదు. ప్రతిఫలాపేక్ష ఉంటే వ్యాపారమే కానీ,

అది దానం ఎందుకు అవుతుంది? అందునా శాకదానం విశేషమని విజ్ఞులు చెప్పారు. అతని వితరణ శీలానికి మెచ్చి భగవంతుడు అనుగ్రహించడం వలన మరుజన్మలో అతడు శ్రీమంతుల ఇంట్లో పుట్టాడు. అతనికి ఐశ్వర్యంతోపాటు కొద్దిపాటి పూర్వజన్మ సంస్కారవాసన లీలగా ఉండడంచేత పొలంలో ఎకరాలకు ఎకరాలు ఆకుకూరలు పండించి మోపులు మోపులుకోసి ఇచ్చి పంపిస్తూ, అందరినీ **'అంతకు ఇంతైంది, ఇంతకు ఎంతవుతుందని'** అడిగేవాడట. అది విన్నవారు సమాధానం చెప్పలేక వెర్రిమొహం వేసేవారట. అడిగేవాడికి, చెప్పేవాడు లోకువ కదా! ఈ పిచ్చిమాటలతో మనకేంపని ఈపూటకు కూర దక్కిందికదా! అని సంతోషపడేవారు. లోలోపల నవ్వుకుంటూ మాట్లాడకుండా వెళ్ళిపోయేవారు.

ఒకసారి జ్ఞాని ఒకడు అతడికి తారసపడినపుడు అతని ప్రశ్నకు సమాధానంగా... **'అంతకు ఇంతైంది, ఇంతకు అంతేఅవుతుంది'** అని విషయం వివరించాడట. ఇపుడు తనకున్నస్థితికి తగినట్లు గుడి కట్టించడమో, బడి పెట్టించడమో, సమాజానికి ఉపయోగపడే శాశ్వతమైన గొప్పపని చెయ్యాల్సింది పోయి, **దశదానాలకు తోటకూరకట్టైనా సరిపోతుందిలే** అని సరిపెడితే ఫలితం శూన్యమే అవుతుంది. అదే విషయాన్ని **శ్రియాదేయం, భియాదేయం** అంటూ గురువులు ఉపదేశించారు వేదంలో. శ్రద్ధా, భక్తులతో, తనస్థాయికి తగినట్లు సమాజ పరమేశ్వరుణ్ణి ఆరాధించుకోమని గురువుల భావనగా తెలుస్తుంది. ప్రాణులకు మేలు చేస్తే పరమాత్మ తనకు చేసిన పూజగా భావించి సంతోషిస్తాడు. దీన్నే **"మానవసేవే, మాధవసేవ"**గా పెద్దలు సూచించారు.





మరణించేవరకూ వెంటాడుతూనే ఉంటుంది. దాంతో వారు అనేకమైన అకృత్యాలకు పాల్పడుతూనే ఉంటారు. తమోగుణ ప్రధానమైన ఈ కోపం, అధికమై క్రోధంగా మారినపుడు వ్యక్తులు, కుటుంబాలు, ఊళ్ళు బలయి పోతుంటాయి. ఇంక అది, తరతరాలకూ సంక్రమించి, వారసత్వంగా నిలిచిపోయి నిరంతరం కక్షలతో, కార్పణ్యాలతో రగిలిపోవడం చూస్తూ ఉంటాం. అట్టివారికి శాంతి, సౌఖ్యం అనేవి ఉండవు. ఆ మన్యుకృతమైన పాపములనుండి రక్షించమని నిత్యం సంధ్యావందనంలో దైవాన్ని ప్రార్థిస్తూఉంటాం. అది ద్విజులకు దైవమిచ్చిన వరం.

ఏవిధంగా చూచినా కోపం చెడుచేస్తుందే తప్ప మంచిని చేకూర్చదు. సాధ్యమైనంతవరకూ దానికి దూరంగా ఉండడమే మేలు. ఆరోగ్యానికి కూడా భంగం కలిగించే కోపాన్ని అధిగమించడానికి అన్ని విధాల ప్రయత్నం చేయాలి. లేకపోతే రక్తపోటు ఎక్కువై కాళ్ళు, చేతులు పడిపోయే అవకాశం ఉంది తస్మాత్ జాగ్రత! జాగ్రత! ఈ విషయంలో పిల్లలను మెచ్చుకోవాలి. వారికీ ఎంతో కోపం వస్తుంది. అంతలో మరచిపోయి, వారు హాయిగా కలిసిపోయి, సంతోషంగా ఆడుకుంటారు, ఆనందం పంచుకుంటారు. ఆలోచిస్తే వారే ఉత్తములు.

**శ్లో॥ ఉత్తమే క్షణ కోపస్స్యాత్, మధ్యమే ఘటికాద్వయమ్ ।**
**అథమే స్యాదహో రాత్రం, పాపిష్ఠే మరణాంతకమ్ ॥**



సహృదయులై సజ్జనులనబడేవారు ఏ కారణం లేకుండానే ఎప్పుడూ ఇతరులకు మేలు చేయడానికే ప్రయత్నిస్తుంటారు. వారే సజ్జనులు, ధన్యులు, వారే యోగ్యులు, పుణ్యమూర్తులు అని కీర్తింపబడతారు. వారి జీవిత పరమార్ధమే పరోపకార పరాయణత.

**శ్లో॥ తే సుజనాః, తే ధన్యాః, తే కృతినః, తేహి సుకృతినోలోకే ।**
**యే కారణం వినాஉపిచ, పరహిత కరణాయ హన్తజీవన్తి ॥**



## ఉత్తములకు కోపం క్షణికమే!

జీవులకు రాగ, ద్వేషాలు పుట్టుకతోనే వస్తాయి. పుడకల మీదికి చేరేదాకా వెంట వస్తూనే ఉంటాయి. తనంతవాడు లేడని, అహంకరించేవారికి మంచి చెప్పినా వినరు, సరికదా.... నాకు చెప్ప వచ్చేవాడివా? అని ధిక్కారస్వరం పెంచుతారు. **"తనకు తోచదు చెప్పినా వినదు"** అనేది వీరి వలన ఏర్పడింది. రావణాదులు రజోగుణంతో వినకపోయినా, సాత్వికులగు విభీషణాదులు సత్యాన్నీ, ధర్మాన్నీ వినిపిస్తూనే ఉంటారు. ఇదే లోకం పోకడ.

ఒకప్పుడు ఉత్తములనబడే వారికి కూడా కోపం వస్తుంది. ధర్మానికి భంగం ఏర్పడేటప్పుడు వారు హుంకరిస్తారు. మరుక్షణంలో మరచిపోతారు. ఎదుటివారిలో దోషాలను విడిచిపెట్టి, గుణాన్ని మాత్రమే గ్రహించి ఆదరిస్తారు, అభిమానిస్తారు. రాముడు తనకు అపకారం చేసినవారిని కూడా మన్నించేవాడట. ఏమాత్రం తనకు, ధర్మానికి ఉపకారం చేసినా వందరెట్లు ఎక్కువగా భావించేవాడట. అది అతని సత్వగుణానికి గుర్తు.

**శ్లో॥ కథం చిదుపకారేణ, కృతేనైకేన, తుష్యతి ।**
**న స్మరత్యపకారాణాం, శతమప్యాత్మ వత్తయా ॥**

**(వాల్మీకి రామాయణం, అయోధ్యాకాండ, 1-11 శ్లో॥)**

ఇతరులయెడ కలిగిన కోపం సామాన్యులకు 2ఘడియలు ఉంటుంది. ఇంకొందరికి ఒక పగలు, రాత్రి ఉండి సమసిపోతుంది. పాపిష్ఠోళ్ళకుమాత్రం



## తృప్తి

తనకున్నదానితో సరిపెట్టుకొని సంతోషించడాన్ని తృప్తి అంటారు. ఈనాటి జీవన విధానంలో అటువంటిది చాలా అరుదు. ఆశలకోసం, ఆశయాల కోసం ఆరాట, పోరాటాలు తప్పడంలేదు. కావాలనుకున్న కళాశాలలో తనకు చదువుకొనే అవకాశం లభించలేదని, చదువుకు తగిన ఉద్యోగం రాలేదని, లభించిన జీవిత భాగస్వామి ప్రవర్తన చూసి అసంతృప్తి. పుట్టిన బిడ్డల విషయంలో ఆడ, మగ అనే తేడాతో అసంతృప్తి. ఇంకా వారేదో తనకు చేయలేదని తల్లిదండ్రులు, అన్నదమ్ములు, అక్క, చెల్లెండ్రు విషయంలో అసంతృప్తి. గొప్పగా మనకు సహకరించడం లేదని బంధు, మిత్రులయెడ అసంతృప్తి. ఈ స్థితి అన్ని రంగాలలో అందరి జీవితాలలో చోటుచేసుకొని అసహనానికి దారితీస్తోంది. సమాజ వ్యవస్థపై తిరగబడడానికి దోహదం చేస్తోంది. అసంతృప్తుడైనవాడు పతనావస్థకు చేరుతాడని పెద్దలు చెప్పారు. ఈనాటి అలజడులకు, ఆందోళనలకు ఈ అసంతృప్తే మూలం.

ఇప్పటికంటే మెరుగైనస్థితి కలగాలని ఆశించడం, అందుకు తగిన కృషి చేయడం జీవులందరిలోగల ఆశకు నిదర్శనం. అభివృద్ధికి మార్గం. ఆశ మితి మీరినప్పుడది పిశాచంగా మారుతుంది. మోహమే పాశమై బంధిస్తుంది. దురాశ దుఃఖానికి కారణమౌతుంది. భాగవతం, వామనావతార ఘట్టంలో బలిచక్రవర్తి తనుచేసే యజ్ఞానికి వచ్చిన వామనుని రూపానికి ముచ్చటపడి, విద్యావైదుష్యాలను చూచి ఆశ్చర్యపడి, ఆనందంతో ఏదైనా వరం కోరుకోమంటాడు. అందుకు వామనుడు 3అడుగుల నేలను ఇమ్మని, అదే తనకు చాలని అంటాడు. బాలుడవు నీకు అడగడం చేతకాదు. ఎవరినన్నా అడిగితెలుసుకుని రమ్మంటాడు బలిచక్రవర్తి. అప్పుడా వామనుడు "తృప్తిలేని మానవుడు సప్తద్వీపములు తనకు లభించినా ఇంకేదో కావాలని ఆశిస్తాడు. భూమితోపాటు ఆకాశం కూడా తనకు ఉంటే బాగుంటుందని ఆకాంక్షిస్తాడు." అని చెప్పి తను కోరిన మూడడుగులిస్తే తనకు బ్రహ్మాండమిచ్చినట్లు ఔతుందని సమాధానమిస్తాడు. ఈసందర్భంలో పోతన ఆంధ్రమహా భాగవతంలో ఇలా వివరించాడు.

వ్యాప్తింబొందక, వగవక,
ప్రాప్తంబగు లేశమైన పదివేలనుచున్,
తృప్తిం చెందని మనుజుడు
సప్తద్వీపములనైన చక్కంబడునే

ఆజ్యంపోసిన అగ్నిలా తీరినకొద్దీ కోరికలు పెరుగుతూనే ఉంటాయి. జుట్టు నెఱసిపోయి, ముఖం మడతలుపడి, ముసలితనంపైబడి శరీరం సహకరించక పోయినా, ఆశమాత్రం నిరంతరం యౌవనంగానే ఉంటుందని భర్తృహరి అంటాడు.

**వలిభిర్ముఖ మాక్రాంతం, పలితైరంకితం శిరః**
**గాత్రాణి శిథిలాయంతే తృష్ణైకా తరుణాయతే॥**

జీవితంలో తనకు లభించిన దానితో తృప్తిపడి సుఖ, దుఃఖాలకు లోబడక, ఎవరినీ ఉద్దేశింపక, జయాపజయాలను సమంగా భావించే సుకృతి, దేనికీ కట్టుబడదని, “తక్కిన విషయ సుఖాలకంటే ఆశను జయించడం ద్వారా కలిగే సుఖం, దానివలన ఏర్పడే సంతృప్తి ఎన్నో రెట్లు గొప్పదని మహాత్ములు బోధించారు. సమాజాభ్యుదయానికి ప్రపంచశాంతికిదే మహోన్నత మార్గంగా సూచించారు.





# సజ్జన దర్శనం

**శ్లో॥ గంగా పాపం, శశీ తాపం, దైన్యం కల్పతరుస్తథా ।**
**పాపం, తాపం చ, దైన్యం చ, హంతి సజ్జన దర్శనం ॥**

**గంగ :** తెలిసీ, తెలియక చేసిన పాపం పోవడానికి, ఈ జన్మలోనేకాక పూర్వజన్మలలో చేసిన పాపంపోవడానికి కూడా గంగాస్నానం చేస్తే మంచిదంటారు. అంతేకాదు, ఈ శరీరం జీర్ణమైపోయినపుడు గంగాజలం సేవిస్తే అది ఔషధంగా ఉపయోగపడి పరిపూర్ణమైన ఆరోగ్యం చేకూరుస్తుందని భక్తుల విశ్వాసం. హిమాలయాల్లో ఉన్న అనేక ఓషధుల గుణాలుకూడా గంగాజలంలో కలిసి దానికి ఆ గొప్పదనాన్ని తెచ్చిపెట్టాయి. తక్కిన జలం 2, 3 రోజులు నిలవఉంచితే అందులో సూక్ష్మక్రిములు చేరి పాడయిపోతాయి. గంగాజలం ఎన్నాళ్ళు, ఎన్నేళ్ళు నిలవ ఉంచినా చెడిపోవు. దోషాలను తొలగించి జనులను పవిత్రులను చేయడంలో గంగకు అంత ప్రాధాన్యం ఉంది.

**శశి (చంద్రుడు) :** సూర్యోదయం నుండి పగలంతా ఎండకాసి, ఆ వేడికి ఉడికిపోతున్న జనులకు చంద్రోదయంతో చల్లదనం సిద్ధిస్తుంది. వెన్నెల మంచి ఆహ్లాదాన్ని కలిగిస్తుంది. అందుకే లలితా సహస్రనామాలలో అమ్మకు **‘తాపత్రయాగ్ని సంతప్త సమాహ్లాదన చంద్రికా’** అన్నది ఒకనామం. చంద్రిక అంటే వెన్నెల అన్ని అర్థం.

**కల్పవృక్షం :** స్వర్గంలో ఉండేది, కోరినకోరికలు తీర్చేది, కల్పవృక్షం. ఈ లోకంలో కూడా తమ దాతృత్వంతో ఇతరులుకు సహాయం చేసేవారిని కల్పవృక్షంతో పోల్చడం జరుగుతుంది. ఆ విధంగా దైన్యాన్ని పోగొట్టేది కల్పవృక్షం.

సజ్జనులు, పాపాన్ని తాపాన్ని, దైన్యాన్ని పోగొట్టి ఆదరిస్తారు. ఆపదనుండి రక్షిస్తారు. చెడును పరిహరించి, పాపం అంటకుండా చేస్తారు. అందువల్ల సజ్జన సందర్శనం పై మూడు ప్రయోజనాలనూ సిద్ధింపచేస్తుంది. మహాత్ములను భక్తితో దర్శించడం, వారి మాటలు విని ఆచరించడం, వినయంతో నమస్కరించడం, సుఖాలను, శుభాలను కలుగుచేస్తాయి.



రచయిత :

భాషాప్రవీణ, విద్యాప్రవీణ

డాక్టర్ తూములూరు శ్రీదక్షిణామూర్తి శాస్త్రి M.A. Ph.D

## శాస్త్రిగారి ఇతర రచనలు - ప్రచురణలు

## ముద్రితములు

1. శ్రీ రామకథా2మృతము - సమగ్ర సమీక్ష ఆంధ్రా యూనివర్శిటీ వారిచే Ph.D. పొందిన పరిశోధన నిబంధము.
2. రామాయణం-సమాజ దర్పణం 1వ భాగము
3. రామాయణం-సమాజ దర్పణం 2వ భాగము
4. శ్రీరామ వాణి
5. వాల్మీకి వాణి
6. హనుమద్వాణి
7. పావనీ శతకము
8. మహాభారత పారిజాతము (సంకలనము)
   శ్రీలలితాసహస్రనామ వివరణము (అముద్రితము)
9. మాటలంటే మాటలా ?
10. ముసునూరివారి వంశ చరిత్ర
11. తెలుగు వ్యాకరణము
12. భావదేవశతకము
13. శ్రీ వీరాంజనేయ శతకము
14. శ్రీ సత్యనారాయణ శతకము
15. శ్రీ కపోతేశ్వర శతకము
16. శ్రీ రాజరాజేశ్వరీ శతకము
17. శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్రము ప్రతిపదార్థసహితము
18. శ్రీ త్రికూటేశ్వర త్రిశతి
19. యోగవైభవము.

# సుమధుర
# సంస్కృత సూక్తులు

(మొదటి భాగము)




రచయిత :

భాషాప్రవీణ, విద్యాప్రవీణ

డాక్టర్, తూములూరు శ్రీదక్షిణామూర్తిశాస్త్రి

ఎమ్.ఏ., పిహెచ్.డి.

పొన్నూరు, 81067 66197

